# తప్పెవరిది?

మూడంకముల నాటకము.



పా. వే. రాజమన్నారు బి. ఏ. బి. ఎల్.

1929





[వెల రూ. 1

# అంకము. ౧.

రంగము. 1. కళాశాల హాస్టెల్‌నందు ఒకగది.

(ప్రవేశము: ఆసీనులై రామచంద్రరావు, విశ్వనాథము, రాధాపతి. విశ్వనాథము రాధాపతి మంచముపై గూర్చుండి సిగరెట్లు కాల్చుచుందురు. రామచంద్రరావు ఏదియో పుస్తకము చదువుచుండును.)

రాధా—రామూ! గ్రంథము కట్టిపెట్టి నీ పాండిత్యసంపద మాకు కొంత ప్రసాదింపరాదా?

విశ్వ—ఎల్లప్పుడును ఇతరుల యభిప్రాయములతోనే కాలము బుచ్చుచుండినచో, స్వాభిప్రాయము పూర్తిగ నశించును సుమా.

రామ—పొరబాటు! స్వాభిప్రాయ మట్టియెడ నెన్నటికిని నశింపదు. వృద్ధియగును, మార్పులుపొందును, గాని నశింపదు. అభిప్రాయము లెప్పుడును అనుభవజనితములు, వానికి స్వానుభవ మెంత ఆవశ్యకమో ఇతరుల అనుభవవిశేషములును అంత ఆవశ్యకములు (అని పుస్తకము మూసివేయును.)

పోనిమ్ము... మొన్న హిందూపత్రికలో బాలికాబాలులు సహపాఠకులుగ విద్యాభ్యాస మొనర్చుపద్ధతి

ననుసరించిన స్త్రీపురుషసంబంధ సమస్య విడిపోయి దేశము బాగుపడునవి ఎవరోవ్రాసిన వ్యాసము చదివి తివిగదా. ఆవిషయముపై నీ యభిప్రాయములేమి?

రామ—ఆవ్యాసమును వ్రాసినవాడు పిచ్చివాడు, లోకజ్ఞాన రహితుడు.

రాధా—ఎందులకు?

రామ—స్త్రీపురుషులకు పరస్పరాకర్షణము సహజము. అభ్యాసజనితముగాదు. అందుచే ఆకర్షించువస్తువు దగ్గఱ నున్నచో ఆకర్షణము తప్పక సిద్ధించును. అట్టి యాకర్షణమునకు లెక్కల్లేని తరుణములు సంకల్పించు సహా ...యము ఎన్నటికిని శ్రేయస్కరము గానేరదు. ... చైత్య సంఘములందు సైతము ప్రాజ్ఞులలో నిట్టి యభిప్రాయములే ప్రబలుచున్నవి.

రాధా—రామూ! ఆకర్షణశక్తి గుఱించియే ఉపన్యసించితివి గాని నిగ్రహాశక్తిగుఱించి మరచియేపోతివా? పతివ్రతా ప్రభావమునకు బుట్టినిల్లగు పవిత్ర భారతదేశమున జితేంద్రియత్వము కష్టసాధ్యమా?

రామ—ఆగుమాగుము! నీ యుదాహరణములే నీసిద్ధా ములను ముక్కలు సేయుచున్నవి. మొదట, ని శక్తియంటివి. అదిసహజముగాదు, సాధారణము కేవల ప్రయత్నసాధ్యమని ఒప్పుకొందువుగదా

గట్టు వేసినంత మాత్రాన ప్రవాహము ప్రవహింపక మానునా? ఏక్షణమున కట్ట చివికిన నాక్షణమున మహాశక్తితో ప్రవాహము నిరాఘాటమగును...... నిగ్రహశక్తిపై ప్రతిక్షణమున ఆధారపడియుండుటకు బాలికాబాలకులు ఎంత చిత్తశక్తి వినియోగింపవల యును? అట్లొనర్చుట హానికరముగదా. విద్యాభ్యాస మొనర్చునప్పుడు అట్టి వికారహేతువులే లేకుండుట ఉత్తమముగాని, వికారములను జయించుటకు సగము శక్తి వినియోగింపజేయుట ఉత్తమము సుమా?... రెండవది పతివ్రతాప్రభావము నుగ్గడించుచుంటివి. జితేంద్రి యత్వము అంత సులభసాధ్యమైయుండిన పతివ్రతా మహిమ అంత గణనీయముగానుండదు సుమా! ఈయాకర్షణశక్తి ప్రభావము బాగుగ నెఱిగిన వారు గనుకనే మనపూర్వులు, ఋషులు, మునులు, సంస్కర్తలు కారులు, ధర్మవేత్తలు, సంఘసౌశీల్యమునకై, అన్యో న్య సంబంధానుబంధ సౌలభ్యమునకై పతివ్రతాధర్మ మును ఏకపత్నీవ్రతమును కొనియాడుచు శ్లాఘించిరి.

విశ్వ—అదిగో! రామూ! నీవు పూర్వులను ఎత్తిపొడుచుచు వారి మార్గమునే అనుసరించుచున్నావు?

రామ—లేదు, ముమ్మాటికిలేదు. నేను మహోద్యాన నంప న్నులగు పూర్వులను హేళనము సేయుటలేదు. వారి బుద్ధిని మెచ్చుకొనుచున్నాను. వారు స్థాపించిన ధర్మ

ములను, వారు నిర్ణయించిన నియమములను, వారు అనుష్ఠించిన యాచారములను, కేవలము, మూఢాత్ముడనై ఆలోచింపకయే ఏకగ్రీవముగ కొనియాడుట మాత్రము లేదు. ఆధర్మములను, ఆనియమములను, ఆయాచారములను పరిశీలించి వాటి యుపయోగములను, అర్థమును, ఆవశ్యకతను, కనుగొని, నేటి సంఘపరిస్థితులలో వాటి నెట్లు మార్చుకొనిన సార్థకములగునో అని పలుమారు చింతించుచుందును.

రాధా—ఓహో!...నీవును తొల్లి ఆర్యులు నుడివినట్లే 'పొలతిదానవహ్ని పురుషు డాజ్యఘటంబు'...అని యందువు గాబోలు.

రామ—నిస్సందేహముగ.

రాధా—ఎందుచేత !

రామ—దైవనిర్మితమగుటచే కారణము ఊహింపజాలము. ఆవాక్యము సత్యముగాదని కన్నులుండియు గట్టిగ మూసికొని అంధత్వము నభినయించువారు కొందఱుందురు.

రాధా—నీ స్వాంతమును నభినయము సైతము అంతయే గాబోలు.

రామ—(కొంచెకోపముతో) అనగా? తెలియకున్నాను. గూఢముగ మాట్లాడుచున్నావో మూఢముగ మాట్లాడుచున్నావో నీకే తెలియదనుకొనెదను.

[హోటల్ నౌకరు శంకరుడు టీ పుచ్చుకొని ప్రవేశించి, మధ్య నున్న బల్లపై బెట్టును.]

విశ్వ—రాధా! అనవసర ప్రసంగములోనికి దిగుచున్న ట్లున్నది...కొంతసేపు చాలించి టీపుచ్చుకొనెదము రమ్ము. (అని టీ కలుపును.)

(చేతికి గిన్నె అందిచ్చుచు) రామూ! చర్చలో కోపమెందులకు.

రామ—(గిన్నెపుచ్చుకొని) అవును. అనవసర ప్రసంగము లోనికి దిగితిమి.

(ఇక్కడనుండి సంభాషణతో బాటు టీత్రాగుటయు జరుగుచుండును.)

రాధా—అనవసరమెందుకు? మన రామచంద్రుడు మన దే సంగలి సతీమతల్లుల గుణశీలములకు నిందారోపణ చేయుచుండ నీవలె నేనును నోరుమూసికొని యుండ జాలను.

రామ—నిజమాడిన నిష్ఠురోక్తులు. అదిగాక—మన దేశము మన దేశము అనుటలో మాయలేదు. ప్రపంచమం దంతటను స్త్రీపురుష స్వభావము లొక్కటేగాని ఆచారవ్యవహారములు, సంఘధర్మములు, మతని యమములు వేరగుటచే తత్కారణముగ ప్రాప్తించిన భేదములుమాత్రము ఉండవచ్చును. అంతమాత్రమున నొక దేశపుస్త్రీలకును ఇంకొక దేశపు స్త్రీలకును గుణ

శీలములందు తారతమ్యమున్నదనుట తప్పు. చూడుము. సొగసైన వస్త్రములను ధరించుట కాసక్తి ప్రపంచము నందలి వనితాలందఱకును సాధారణము. కాని, మన వారు నలుబదిసేరులు బంగారు జరీపనిచేసిన దళసరి పట్టుచీర కట్టుకొనుట కిచ్ఛగింపవచ్చును. ఫ్రాన్సు దేశపు యువతీమణులు మూడుభాగములు ఒడలు గనంబడునట్టి ఉల్లిపొర పట్టుగాను తొడుగుకొనుట కాశింపవచ్చును. అంతే......మనపూర్వ ధర్మకర్తలు స్త్రీపురుష స్వభావములను బాగుగ గ్రహించినవారు గనుకయే తగిన కట్టుబాట్లేర్పరచినారు.

నా—అయితే, నీప్రకారము విద్యార్థులుగ నున్నంత కాలము స్త్రీసహవాసమే యుండకూడదనియేనా నీ యభిప్రాయము.

రామ—అవును. నేను వర్ణించిన యాకర్షణమునకు దారి నొసగు స్త్రీసహవాసము పూర్తిగ లేకుండిననే ఉత్తమము.

విశ్వ—అవును మరి. వరుస, వావి, అడ్డమున్నప్పుడు, సౌందర్య వయో విశేషములు సమానములైనను ఆకర్షణ శక్తి యుండదుగదా!

రాధా—ఓహో...ఆగుమాగుము. మన రాముడు ఆమాట ఒప్పుకొనునో లేదో, ఆకర్షణశక్తికి అడ్డేలేదనునేమో?

రామ—రాధాపతీ! నన్ను పరిహసించుట నీకు క్రొత్తగాదు గనుక నీవన్నది పరిహాసమునకేయని తలచెదను.... అయినను నీవాక్యములో సత్యముగూడ నున్నది సుమా.

రాధా—ఆహా! సారంగధరోపాఖ్యానములు రాజరాజన రేంద్రుని కాలముతో నిలిచిపోలేదని అంటువుగాబోలు.

విశ్వ—అదియు నిజమేగదా. రాధా! రాజరాజ నరేంద్రుని వంటి మహానుభావులు, అరువదియేండ్ల వార్ధక్యమున పదునారేండ్ల సుందరీమణిని చేబట్టు రసికవర్యులును, మనసు బట్టజాలని చిత్రాంగులును ఉండునంతకాలము ఎట్లు నిలిచిపోవును?

రాధా—(హేళనముగ) విశ్వం! ఆలోచించియో, అనాలోచితముగనో పాపము! సారంగధరునిమాట వదలివైచితివి. బహుశః ఈకలికాలమున సారంగధరోపాఖ్యానమునకు సమాప్తము భేదముగ నుండునని గాబోలు... రెండవ యంకమున చిత్రాంగీ సారంగధర సమావేశము. మూడవ యంకమున చిత్రాంగీ సారంగధరుల పలాయనము. నాల్గవయంకమున రాజరాజ నరేంద్రుని యున్మత్తావస్థ, నిర్యాణము. పంచమాంకమున సంఘసంస్కరణ వివాహము. మంగళము. కాబోలు. ఏమి... రామూ!

రామ—(బొమలు ముడిచికొనును. అధరము అదురుచున్నది.) ఏ యుపాఖ్యానమునకు ఏయంతమో ఆ జగన్నాటకసూత్రధారు డొక్కడే ఎఱుగును...... పోనిమ్ము. ఈ కలికాలమునగాదు ఆ ధర్మకాలముననే అగుగాక సారంగధరునకు ఏమీగతి బట్టినది? ఆ యకలంక వర్తనునకు, ఆన్యాయశీలునకు, ఆనిగ్రహాశక్తికి, లోకముమెచ్చి ఏ పట్టుశాలువలు గప్పినది? ఈ కలియుగమునగాదు. ఆ సత్యయుగముననే...లోకులు చిత్రాంగిమాటనమ్మిరా, సారంగధరుని మాట నమ్మిరా? ఆకర్షణశక్తి ప్రభావముల ఆమోదించిరా, కాక నిగ్రహాశక్తి మాహాత్మ్యమును నిర్ణయించిరా? మన పూజ్యభారతదేశముననే జితేంద్రియత్వమున కొక సలాముసేసి సారంగధరుని యంగములు తెగనరికిరి. పోనిమ్ము, తరువాతనైన మనవారు బుద్ధితెచ్చుకొనిరా? చిత్రాంగిని దూషించి, సారంగధరుని ఉగ్గడింప మొదలిడిరి గాని, వారిర్వురికన్న ఘోరతరపాపము నాచరించిన రాజరాజ నరేంద్రుని వర్తనమును ఖండించి వదలిపెట్టిరా? లేదు. రాజరాజ నరేంద్రుని యలవాటు అతనితో నంతమొందినదా? లేదు. వర్ధిల్లి, పెచ్చుపెరిగి, దేశమంతటను పాదుకొనియున్నది.

రాధా—సారంగధరుని చరిత్రమునుండి నీవు గరచిన నీతులు క్రొత్తగనున్నవి సుమా?

రామ—నీతి! నీతి దైవనిర్మిత మనుకొంటివి గాబోలు! నీతి యనునది ప్రకృతిశాస్త్రధర్మములువలె ధ్రువమును, నిశ్చయమును, అభేదమును అని యెంచుచుంటివి గాబోలు?

రాధా—లేదు, లేదు. నీతి యనగా లోకమునకంతయు నొకటి. తనకుమాత్రము వేరొకటి.

రామ—నీ వెక్కిరింపులో సత్యమున్నది, నీ వెఱుగవు గాని. ఒక్కొక్కరికి మతము వేరువేరుగ నుండునట్లే నీతియు.

రాధా—నీ వాదములు నాకు భయము గొల్పుచున్నవి. నీ తండ్రికి వినిపించిన నేమనునో?

రామ—(పెదవి గరచుకొని మొదట చదువుచుండిన గ్రంథము పుటలు త్రిప్పుచు ఊరకుండును).

విశ్వ—రాధా! అకారణముగ రామచంద్రుని మనసు నొప్పించితివి. ఇదియే గదా నీలోపము. చర్చనుండి స్వవిషయములకు దిగితివి?

రాధా—రామూ! క్షమింపుము, క్షమింపుము. నీ వింతకు ముందు రాజరాజనరేంద్రుని దూషించి అతని చర్య ఖండించినపుడు . . . ఏమో . . . తలవని తలంపుగ మీతండ్రి జ్ఞాపకమునకు వచ్చెను. అందుచే నీ కోపము చూచి భయపడితిని.

రామ—(కన్నులొక్కమారు మూసి మరల తెరచి, లేచి ఇటునటు పచారు చేయుచుండును).

విశ్వ—రాధాపతీ! మానవా

రాధా—(లేచి, రామచంద్రుని చేయిపట్టుకొని) రామూ! ఇంతమాత్రమునకే ఇంత ఆయాసమా? ఇంత కలవరమా. చిన్నసూదితో తాకినమాత్రాన తాళజాలకుండిన నీ జీవితమున నింక పెద్ద గాయములకు, కత్తిపోటులకు, గొడ్డలి దెబ్బలకు ఎట్లాగ గలవు?

రామ—(కించిత్ గద్గదస్వరముతో) రాధా! నీపై కోపము లేదు. మా తండ్రిగారి ద్వితీయవివాహ మైనప్పటినుండియు ఆసంగతియే మరచిపోవలెనని ప్రయత్నించుచున్నాను. అందుచేతనే నెల కొకమారైనను ఆవైపు పోవుటలేదు. నీవు అనాలోచితముగనే జ్ఞాపకమునకు దెచ్చితివి.

రాధా—పోనిమ్ము......అదిగో, నాలుగు కొట్టబోవుచున్నది. టెన్నిస్ ఆడుకొందము రమ్ము. ఎన్నికష్టములైనను ఆటలో మరుగుపడును రమ్ము.

విశ్వ—అవును రమ్ము.

[ముగ్వురు కోట్లుతొడుగుకొనుచుండ, శంకరుడు ప్రవేశించును. ముగ్వురను నిష్క్రమింతురు.]

శంక—(టీ వస్తువులన్నిటిని పోగుచేయుచు) ఎవరో, టీ సగము

గిన్నెకైనను త్రాగలేదు. రామచంద్రరావుగారే అగు
ను. మాటలలోనికి దిగినప్పుడు టీ సంగతియే మరచి
పోయి యుందురు.

[ప్రవేశము అజీం]

అజీం—సలాం, భాయి !

శంక—(తిరిగి) ఎవరది ?

అజీం—నేను రిజిస్ట్రారుగారి నౌఖరును అజీం.

శంక—(విసుగుతో) కావచ్చును గాని నాకు భాయివి మా
త్రము కావు.

అజీం—భాయి ! అంత కోప మెందుకు ? మన మందరము
భాయీలే గదా. అల్లాదైవము ఒక్కడే గదా .
కందఱకు సృష్టికర్త.

శంక—నీతో మతవాదము సేయుటకు నాకు ఓపిక లేదు. నా
తలిదండ్రులకు నే నొక్కడనే కుమారుడను. కావున
నాకు భాయీలు ఎవరు లేరు......నీ వేదియైన పని
మీదవచ్చిన పనితీర్చుకొని వెళ్లవచ్చును. పనిలేక
వచ్చినచో ఇప్పుడే వెళ్లవచ్చును.

అజీం—పనిలేక తిరుగులాడుటకు నా కింకయు సేవకావృత్తి
ఆఖరు కాలేదు. అమ్మగారు చిన్నయ్యగారికి ఉత్తరము
చేతికిచ్చి జబాబు తెమ్మనిరి. అదియే నా పని. ఆపని
ముగించువరకు నీవు వెళ్లమన్నను వెళ్లను.

శంక——సరే. (అని టీ వస్తువులు తీసికొని పోబోవును)

అజీం——భాయి !......అయ్యో, కాదు, కాదు. మీ పేరు తెలియదు. బాబూ, కొంచము అందులో చా ఉండిన ఇప్పించెదరా? దాహముగా నున్నది.

శంక——ఏమయ్యా, సాయబూ, పరిహాసము చేయుచున్నావా?

అజీం——అరే! పరిహాసమా? నీతోనా. మా బీబీతోనే పరిహాసము చేయనే, నీతో నెందుకు, బాబూ...అటు పైన...ఇందు పరిహాసమున కేమున్నది?

శంక——అట్లయిన పెంకితనము గాబోలు.

అజీం——ఏమయ్యా, మాటలు అర్థము చేసికొనకుండ మాట్లాడుచున్నావు.

శంక——లేదు. నీవే పిచ్చిపిచ్చిగ మాట్లాడి ఇతరులను ఆక్షేపించుచున్నావు. కాకపోయిన, నీవు, ముసల్మానువు, హిందువులు త్రాగు ఈ గిన్నెలను ముట్టుకొనుటకు ప్రయత్నింతువా?

అజీం——ఏమి? నా చేతులు పరిశుద్ధముగ లేవా? నేను ముట్టుకొనిన గిన్నెలు విషమైపోవునా? నేను మీవలె మనుష్యుడను గానా? నాకేమియు దుష్టరోగములు లేవే ...నీచేతులకన్న నాచేతు లేమి తీసిపోయినవయ్యా?

శంక——సాయబూ! నీ యుపన్యాసములను వినుటకు మించిన పని లేదనుకొంటివా? ...మాయాచారములు మాకు

అవశ్యము అనుసరణీయములు. ఆ యాచారము ప్రకారము మ్లేచ్ఛుడవు నీవు ముట్టుకొనిన గిన్నెలు మలినమై పోవును....నీవు ముసల్మానువు. మేము హిందువులము. బ్రహ్మ సృజించినప్పుడే అట్లు భేదము గల్పించినాడు. ...వృధాగ మాట్లాడు టెందులకు ?

అజీం——అరే! మీ బ్రహ్మ సృష్టించినప్పుడే నొసటిపై హిందువు అని వ్రాసినాడా? భేదము కల్పించినాడా! అయ్యో, ఆహార నిద్రాదులు ప్రతిమానవునకును సామాన్యము గావా ?...అందున మతవర్ణ కారణమున మాలిన్యమెట్లు వచ్చును ? బ్రాహ్మణుని చేతిపాలు మాలవాడు తాకినంతనె విషమై పోవునా ? రోగముతో బాధపడుచుండు బ్రాహ్మణుని చేతి యన్నము భుజింపవచ్చును గాని పరిశుద్ధ హస్తములతో నేను ముట్టుకొనిన గిన్నె మరల నీవు ముట్టుకొనవు గాబోలు ?..........

శంక——ఏమయ్యా, నాయబూ! అధికప్రసంగములోనికి దిగుచున్నావు. జాగ్రత్త. ఎక్కువగ మాట్లాడినచో అర్ధచంద్ర ప్రయోగము మా బంట్రోతుతో చెప్పి కానిచ్చెదను.

అజీం——(యుద్ధమునకు సన్నద్ధుడగుచు) ఏమి? జాగ్రత్తనా? చూచెదము. నీవు బంట్రోతును పిలుచునంతలో నేమి జఱుగ గలదో......నీచెంపకు నాచేయి తగిలినంత

మాత్రాన నా చేతికి ఏమియు దోషము తగలదులే ...తగిలినా పరవాలేదు.

శంక—(కొంత జంకుచు) సాయబూ, ఏమో అంటినిగాని (నిశ్చయముగ వల్లె వేయదుసా?) పోనిమ్ము. ఎందుకీ వాదము. మీ దారి మీది. మా దారి మాది. అదిగో వర్షము వచ్చుచున్నట్లున్నది. మీ చిన్నయ్యగారును ఇక వత్తురు.

అజీం—హిందువైన నేమి, ముసల్మానైన నేమి, గౌరవమిచ్చి పుచ్చుకొనవలెను.

శంక—(తనలో) సాయబుకి టీ ఇయ్యలేదను కోపము తగ్గ లేదు. (ప్రకాశముగ) సాయబుగారు! నే నేమి చేయ గలను. టీ మీ కిచ్చిన మా యధికారులు ఆక్షేపిం తురు. నేను సేవకుడనే గదా. వారి యిష్టానుసారము నడుచుకొనవలెగదా!

అజీమ్—అరే! నీ చా ఎవ్వరికి గావలెనయ్యా. దుకాణమున అణా పారవేసిన గిన్నెడు దొరుకును.

శంక—(టీ వస్తువులను సేకరించుకొని) అయ్యా, సలాం! అయ్యగారు వచ్చువరకు మీరు ఇచ్చటనే ఉండ వచ్చును. (నిష్క్రమించును.)

అజీం—(నవ్వుకొనుచు) వహావా! అర్థచంద్ర ప్రయోగము నుండి అయ్యావారు ఆలేకుం సలాము వరకు దిగి వెళ్లి

పోయినాడు...తుదకు నా వాదప్రతివాదములకన్న బెదరింపే ఎక్కుడు లాభకరమైనది....ఓహో! వర్ష మెంతలో కురిసి వెలిసినది.

(ప్రవేశము తొందరగ వానలో దడిసి రామచంద్రరావు, విశ్వనాథము, రాధాపతి. ప్రవేశించి కోట్లు తీసివేయుచుందురు.)

రాధా—ఈ వర్షమునకు బుద్ధిలేదు. రోజుకు ఇరువదినాల్గు ఘంటలుండి కాచి కాచి టెన్నిస్ ఆడుకొనువేళకే వచ్చును. చూడుము. అప్పుడే ఆగిపోయినది. పైకిలేచిన మృద్గంధ మింకయు సమసినైనను పోలేదు. కురిచిన నాల్గు ఘడియలు మాత్రము పెల్లుగ కురిసినది. మన దేశనాయకులలో కొందఱి యుత్సాహము వలె (అజీమును జూచి) ఎవడీ ముసల్మాను ?

రామ—(చూచి) ఓహో! మా తండ్రిగారి నౌఖరు.... అజీం! పనిమీద వచ్చినట్లున్నది...అందఱును బాగున్నారు గదా.

అజీం—సలాం. బాబుగారు. అందఱకు కుశలమేనండి. అమ్మగారు తమవద్ద నీ జాబు నిమ్మనిరి. (ఇచ్చి) జవాబుకొఱకు కాచుకొనియున్నాను.

రామ—(జాబు విప్పి చదువుకొని, రాధాపతి చేతికిచ్చును)

రాధా—(చదువును).

,, చిరంరజీవి రామచంద్రునకు. రేపు వినాయక చతుర్థి. స్నేహితులతో విందుగుడువ రావలెను. వీలు లేకుండిన మధ్యాహ్నముపై స్వల్పాహారము బుచ్చు కొనుటకైనను రావలెను. తప్పక...జానకి" (గంతులు వైచుచు) బలే, బలే, ఖరీం, సలీం—నీ పేరేమి ... ఆఁ . . అజీం ! భోజనమునకును, స్వల్పాహారమున కును, తప్పక విచ్చేయగలవారమని విన్నవించుము . . చిరంజీవి. రామచంద్రరావుగారు సమిత్రులుగ వత్తు రని చెప్పుము.

విశ్వ—రాధా! అంతేనా. దండుగ తిండి దొరికినదని బ్రహ్మాం డమంతయు మరచిపోవుదువు గాబోలు! రేపు వినా యక చతుర్థి. హాస్టెలులో విందుగదా. వార్డన్, ప్రఫ సర్లు, అందఱు వత్తురు. మన మందఱము ఇంకొక చోటకి వెళ్లిపోయిన మర్యాదయా?

రాధా—అవునోయి! పానకములో పుడక పడవైచితివి. అయిన అజీం! మీయమ్మగారితో సాయంత్రము అల్పాహారము పుచ్చుకొనుటకు తప్పక వత్తుమని చెప్పుము..

రామ—అవును. అట్లే చెప్పుము.

అజీం—చిత్తము. (నిష్క్రమించును).

రాధా—విశ్వం ! వినాయకచవితికి ఉండ్రాళ్లు మొదలగు

పురాతనపు పిండివంటలు చేయుదురుగాని లడ్డువులు ఫేణీలు చేయరు గదా. అంత స్వారస్యముండదేమో?

విశ్వ—అట్లుగాదు. ఆచారప్రకారము ఆ పిండివంటలు చేసినను, లడ్డువులు గిడ్డువులు చేయకమానరు. నవనాగరతకు ఆ పూర్వపు వంటకములు రుచింపవు.

రాధా—విశ్వం! నీవుకూడ గొప్ప సాంఘిక విమర్శకుడవై పోతున్నావు.

విశ్వ—(ఆలోచన అభినయించును).

రామ—ఏమది. అంత దీర్ఘాలోచన.

విశ్వ—రాధా! రేపు బుధవారము గదా.

రాధా—అవును.

విశ్వ—పదునారవ తారీఖేనా?

రాధా—అవును.

విశ్వ—సరే. నీ యదృష్టము తెల్లవారినట్లే యున్నది. రేపు విక్టోరియా హాస్టల్ వారితో క్రికెట్ మ్యాచ్ మరచిపోతివా? రెండు ఘంటలకు ఆట ప్రారంభమగును గదా.

రాధా—ఛీ, ఛీ, ఛీ, విధవ వినాయకునకు బుద్ధిలేదు. ఆ చవితి ఇంకొకనాడు రారాదా!

విశ్వ—నీమూలమున నతనికి విఘ్నరాజనామము సార్థకమైనది. . . . అయిన, రామూ, నీవే ఒంటరిగ పోవల

యును. నీకు క్రికెట్ రానిది ఉపకరించినది.

రాధా—విధి ఎంత వక్రమైనదో చూడుము. నో రూటలూగుచు నిరీక్షించు నానోట మట్టి. కనులు మూసుకొని మూతి బిగించుకొని యుండు రాముని నోట లడ్డు!

విశ్వ—ఆశలు నిరాశయగునప్పుడు మన రాధాపతికి సైతము వేదాంతము ముదురుచున్నది.

రామ—(నిట్టూర్పు విడిచి) రాధా. అవును. నీ వాక్యమున మహత్తరమైన సత్యమున్నది.

[యవనిక]

---

రంగము ౨: భీమరావుగారి ఇంటి చావిడి.

[ప్రవేశము భీమరావు, అజీము, మాట్లాడుచు]

భీమ—అజీం! ఇంత తెలివి గలవాడవు నీవే ఏమియు సాహాయ్య మొసగజాల ననుచున్నావే.

అజీం—బాబూ! ఉన్న దున్నట్లు చెప్పుట నాయలవాటు.

భీమ—అట్లుకాదు. మీవారిలో మంచి యునానీ వైద్యులుందురు. వారీ విషయములందు మహావిద్వాంసులు, సాధకులు, అని ప్రఖ్యాతి. అట్టివారిలో నొకనిగట్టివానిని నాకొక దివ్యౌషధమును ప్రసాదింపజేసిన నీ స్వామికి నిజమైన యుపకారమును చేసిన వాడవగుదువు.

అజీం—స్వామీ? నాచేతనైన ప్రయత్నము చేసెదను. తమరు తను వైద్యులలో నెవ్వరినైన ఆయుర్వేదమున మంచి మం దొకటి ఇప్పించమని పోయితిరా.

భీమ—మా వైద్యులు వట్టి పనికిమాలిన వారలు. ఆయుర్వేదము మహాశాస్త్రమే గాని తత్ జ్ఞానముగలవారు ప్రస్తుతము లేరు. ఋషిదత్తములైన దివ్యౌషధము లెన్నియో కాలదత్తములై పోయినవి. ఇప్పుడు కుహనావైద్యులు, భిషగాచార్యులమని, భిషగ్రత్నాంధుల మని, పుట్టగొడుగులవలె బయలుదేరి ధనము లాగు

కొని దేహమును పాడుచేయుచున్నారు. అజీం! చెప్పెదను వినుము. ఈ మాట నీతో నంతరించిపోవలెను. ఈ కల్లమందులకై అధికధనము ధారవోసితిని. ప్రతి వార్తాపత్రికయందు ప్రకటనగాంచి నమ్మి, ఆసపడి, నాలుగైదు పదిరూపాయలు పంపి తెప్పించి పుచ్చుకొంటిని. రామరామ! ఆ రూపాయలు కరగబెట్టుకొని త్రాగియుండినను కొంత మత్తై యుండునేమో. పోడిచేసి మ్రింగియుండినను రజితభస్మము సేవించిన ఫలము ప్రాప్తించియుండునేమో . . . ఆ మాత్రలు, ఆ లేహ్యములు, ఆఘృతములు, ఆ భస్మములు . . . బూడిదలో పోసిన పన్నీరువలె వ్యర్థమైనవి. . . . . కాదుకాదు. . .పన్నీరున బోసిన బూడిదవలె నాదేహమును నాశము చేసినవి.

అజీం — స్వామీ! ఒకమారు మోసపోయిన వెనుక ప్రకటనలకై నేల నమ్మకము పోలేదు.

భీమ — అజీం! ఆశ నశింపముండదు, కోరికలకు కొనలుండవు. (ఉన్నతార్థము నిరర్థమయిన క్షణముననే దాని యాకర్షణము, దాని మనోహరత్వము నశించును.) చేతి కందనిదగదు ఎట్టి మూఢప్రయత్నమైనను అవశ్య కర్తవ్యముగ గన్పట్టును. యత్నపరంపరలు విఫలములగు కొలది ఆసక్తి మెండగును. ఇన్నిమందులు సేవించియు నభీష్టము పడయలేదు గదా, ఎల విర

మింపరాదు అని యూచించుచున్నాను. అట్లొనర్చుట మానవప్రకృతికి లక్షణముగాదు. అట్లొనర్చు మానవుఁడు మానవుఁడుగాఁడు. జీవచ్ఛవము. అజీం! మీవారిలో అఘటనఘటనాసమర్థులు, దేహపటుత్వ విషయములో అధికపరిశ్రమమొనర్చి ఔషధ రాజములను సేకరించియున్నారు. వారిలో నొకఁడైనఁ నా యభీష్టము దీర్పగల సిద్ధౌషధమును సంపాదింపవలెను.

అజీం—అయ్యా మీయభీష్టమెట్టిది?

భీమ—ఒక్కమాటలో చెప్పెదను. ముసలివాండ్రను పడుచువారిని చేయజాలిన మందు నాకు గావలెను. పోవుము

అజీం.—స్వామీ! కోపగింపకుము. అట్టిమందు లభింపగలదా? మీరు గోరు మార్పు లోకవిరుద్ధముగాదా. దైవనిర్మితమైన పరిణామము తలక్రిందులుగాదా.

భీమ—పిచ్చివాఁడా! అట్లనకుము. అట్లనుట వైద్యశాస్త్రమున కంటెటికి సిగ్గులచేటు. అట్లనుట మానవుని శక్తికి, ప్రజ్ఞకు, ప్రతిభకు అవమానకరము. అట్లనుట పురుషకారమున నిజయమున్నదని అంగీకరించుట. అజీం! లేదు లేదనుట చేతగాదనుట.

అజీ—చెడిపోయిన దేహమును మరల నెట్లు బాగుసేయుట.

భీమ—ఏల చేయరాదు? గడియారము ఎంత సూక్ష్మమైన యంత్రములతో నడచుచున్నదో ఎఱుగవా. అం

దొకటిరెండు యంత్రములో, మరలో, విరిగి గడియా
రము ఆగిపోయిన, మరల బాగుసేయుట లేదా?
మానవదేహమును అట్లే యంత్రమయము గదా.

అజీం—నేను మూర్ఖుడను. తమరు విద్యావంతులు మీరు
చెప్పునదే సత్యముగావచ్చును. కాని నాకొక సందే
హము. గడియారములను మనుష్యులు తమంతతామే
చేయుచున్నారు. అట్లే మనుష్యులను సైతము నిర్మింప
గలరా?

భీమ—ఆప్రశ్నకు నేనిప్పు డెట్టియుత్తరమును ఇయ్యజాలను.
కాలగర్భమున నెట్టి మహారహస్యములున్నవో ఎవ్వరు
చెప్పగలరు. భవిష్యద్వృత్తాంతము ఊహామాత్రము.
పౌరుషము నిర్జ్ఞేయము. మానవ ప్రతిభావిష్కరణము
అసమానము. అజీం. ఎంతపెద్ద ప్రశ్న వేసితివి.....
నేనట్టి ఘనతరకృత్యముల నపేక్షింపలేదు. నాకు వల
సిన యౌషధము స్వల్పము. దానిని సంపాదింపుము.

అజీం—చిత్తము.

(భీమరావు నిష్క్రమించును.)

(బీడీ వెలిగించి నిష్క్రమింప బోవును.)

ప్రవేశము తిమ్మయ్య.

ఏమి తిమ్మయ్యా ఇట్లు వచ్చితివి. దారితప్పియా
పనిమీదనా?

తిమ్మ—అజీం! అట్లు మాట్లాడకుము. నాకు గష్టముగ నుండును. నిన్ను చూచిపోవుటకు రాకూడదా.

అజీం—(తనలో) దొంగ! వీనికి నాతో నేదియో పనియున్నది. (ప్రకాశము) తిమ్మయ్యా! ఎంతదయ నాపై నీకు, నీయట్టిస్నేహితుడు నాకొక్కడు చాలడా.

తిమ్మ—(తనలో) వీడు ఎత్తిపొడుచుచున్నాడు. అయిననేమి, కార్యము కొనసాగుటకు ఎన్నిపాట్లయినను పడవచ్చును. ఎన్నితిట్లయినను తినవచ్చును. (ప్రకాశము) సాయబూ! అందఱును సౌఖ్యమేనా.

అజీం—అల్లాకటాక్షమువలన అందఱము చల్లగనున్నాము.

తిమ్మ—అజీం! అన్యథా తలపవలదు. అకస్మాత్తుగ తలపునకు వచ్చుటచే చెప్పుచున్నాను. ముసల్మానులు మంచి రసికులు సుమా.

అజీం—అరే! అది ఎట్లు కనుగొంటివి?

తిమ్మ—అన్నమంతయు చూడవలెనా, ఒక్క మెతుకు చాలదా. అదిగో చూడు ఆబీడీ ఎంత మధురమైన పరిమళము నొసగుచున్నదో! బీడీలుచుట్టుట ఒక గొప్ప కళ.

అజీం—తిమ్మయ్యా! ముసల్మానుల రసికత్వమునకు ఎంత మంచి యుదాహరణము కనిపెట్టితివయ్యా.

తిమ్మ—అందులో నీవుకాల్చు బీడీలు కడుమజాగానుండును.

అజీం—వాటిని నేనే చుట్టుకొందునని చెప్పలేదా.

తిమ్మ—అవునవును. . . . క్రిందటి పర్యాయము నాకుకొన్ని ఇచ్చినప్పుడు చెప్పితివి. మరచిపోతిని. ఎంతమజాగా నుండినవి.

అజీ—(తనలో) ఇందుకొరకా ఈపాచికలు (ప్రకాశము) తిమ్మయ్యా! కాల్చెదవా, ఇదుగో తీసికొమ్ము.

(అని జేబునుండి తీసియిచ్చును.)

తిమ్మ—భీమరావుగారు లేరుగదా. (ఇటునటు జూచును)

అజీం—ఏమిభయము?

తిమ్మ—ఏమియులేదు. వారుచూచి మా పంతులవారితో చెప్పి ముసల్మానుచేతి బీడీలు కాల్చితినని చీవాట్లు పెట్టింతురు.

అజీం—బీడీలలో నింతభేదమా? . . . . . ఎవరులేరు. పుచ్చుకొమ్ము.

తిమ్మ—(పుచ్చుకొని జేబీలో నుంచుకొనబోవును.)

అజీం—(జేబుచూచి) ఏమి తిమ్మయ్యా. జేబీనిండుగనున్నది.

తిమ్మ—(తబ్బిబ్బై) ఏమియులేదు; ఏమియులేదు.

అజీం—అతిరహస్యము బట్టబయలుగా నున్నది. . . . ఏమియు లేకయే జేబు అంత యుబికియుండునా?

తిమ్మ—అబ్బే. ఏమియు లేదనిన, ఏమియు విశేషము, చెప్ప వలసినంత విశేషము ఏమియులేదు అని

అజీం—ఓహో! నేనేదియో రహస్య మనుకొన్నాను..
ఇంతేనా. ఏదీ చూతము. (చూడబోవును)

తిమ్మ—(తొందరగ) ఆఁ ఆఁ (అని వెనుకకుబోవును)

అజీం—పొమ్ము. గొప్ప స్నేహితుడవు. బీడీలు చేతి కందువరకు కాళ్లు ఆనెనుక,

తిమ్మ—అజీం ఎంత స్వల్పమునకు ఎంత తప్పుబట్టితివి. నా విషయమైనట్లయిన అడిగిన క్షణమే చెప్పియుండనా

అజీం—అది యెట్లు. నీ స్వంతవిషయమై నాయందుగల విశ్వాసము పరుల విషయమై లేదా.

తిమ్మ—పోనిమ్ము. చెప్పెదను. అది మా పంతులవారికొరకు మందు. మంత్రసాని లక్కమ్మ దగ్గరనుండి తీసుకొని పోవుచున్నాను.

అజీం—అరెరే! మంత్రసాని మందులతో మీ పంతులవారికి సంబంధ మేమయ్యా. అందు కింత రహస్య మెందుకయ్యా.

తిమ్మ—ఆ రహస్యము చెప్పివేసెదను. ఎవ్వరితో చెప్పనని ప్రమాణము చేయుము.

అజీం—చేసినట్లె అనుకొనుము.

తిమ్మ—ఈ మందులో దత్తూరా కలిసియున్నది.

అజీం—దత్తూరానా . . . దత్తూరాతో చేసిన మందు మీ పంతులవారి కెందుకయ్యా?

తిమ్మ—వారికి గాదు. (తడబడి) అనగా వారు తీసికొనుటకు గాదు.

అజీం—(తీక్షణముగ జూచి) తిమ్మయ్యా! ఇంకేమియు మోసములేదుగద. ఏమియు దుర్మార్గములేదుగద? జాగ్రత్త. నాతో చెప్పితివిగాన సరిపోయినది.

తిమ్మ—(భయముతో వడకుచు) అజీం! అజీం! అట్టి భయంకరమైన చూపులతో నన్నేందులకు జూచెదవు. ఇందు తప్పు జఱుగుటకు అవకాశమే లేదు. . . . నీవు నెమ్మదిగ చూడుము చెప్పెదను. . ఆం. . . మా పంతులు గారికి భార్యయనిన మిగుల ప్రేమ. . అయినను . . ఇంకయు కాపురమునకు రాలేదని మిగుల చింత. . . ఔషధముల వలన . . .

అజీం—ఛీ. తెలిసినది పొమ్ము.

తిమ్మ—(వదలిపెట్టినదే చాలునని) అవును వేళయైనది. అజీం! ఎవరితో చెప్పవు గద!

అజీం—ఈ భాగ్యము ఇతరులతో జెప్పి ఆనందింపవలెనా. . పొమ్ము. ఎవ్వరితో జెప్పను.

(తిమ్మయ్య నిష్క్రమించును).

(బీడీ క్రింద పారవైచి) . . ఛీ! దైవయాజ్ఞను తిరస్కరించి, దైవనియమములకు నెదురుదారి త్రొక్కజూచు వీరు ఎంత మూర్ఖులు!

[యవనిక]

రంగము 3. భీమరావుగారి గృహమున పడకగది.

[భీమరావు ఆఫీసునకు వెళ్లుటకై వస్త్రములు ధరించుచున్నాడు. జానకి తాంబూల మొసగుచుండును.]

భీమ—ఇక చాలును.

జానకి—ఒక పాట పాడుదునా. క్రొత్తగ నేర్చుకొంటిని.

భీమ—నీకు పాట యనిన ఎంత యిష్టము. (చేతిగడియారము చూచుకొని) నేడు ఆఫీసు సెలవు దినమే. అయినను కొంతపనియున్నది. ఫరవాలేదు. ఒక్క పాట పాడుము.

జానకి—మీరు వలదనిన పాడను. . . మీరు వెళ్లిన వెనుక పాడుకొనుచు కూర్చుందును. ఎన్ని కష్టము లున్నను పాటలో మరిగిపోవును.

భీమ—జానకీ! నీకు కష్టము లేవి యుండును? నీకు గావలసిన వన్నియు ఉన్నవిగదా.

జానకి—(నిట్టూర్చి) ఏమో మాటవరుస కంటిని. . . అనగా పాటలో నెంతకాలమైనను గడుపవచ్చునని యంటిని మామా!

భీమ—అదిగో! నన్ను మామా యని పిలువవలదని చెప్పితిని గదా. 'నాథా' యని పిలువమంటిని. అట్లు పిలుచుటకు సిగ్గుగనుండిన 'ఏమండీ' యనుమంటిని. కాని 'మామా' యని అనవలదు. తప్పు.

జాన—క్షమింపుడు. పండ్రెండేండ్లుగ పిలిచిన యలవాటు మానుట కష్టము గదా. మాయమ్మ నేర్పినది మరచి పోవుటకు కాలము పట్టును. నాథాయని పిలచిన నాట కములోవలె నుండును.

భీమ—పోనిమ్ము, నీ కిష్టమువచ్చినట్లు పిలువుము. ఏదీ ఆ పాటపాడుము.

జాన—(తంబుర గొనితెచ్చి మీటుచు) బాగుండకపోయిన నాక్షేపింపకుడు. ఇతరుల యెదుట పాడుట కభ్యాసము లేదు.

భీమ—మంచిదే. జంకులేక పాడుము.

జానకి—(పాడును)

రాగము : కమాచ్.

మరులు కొన్నదిరా మానినీమణి నీపై
పరిపరి విధముల | పరితపించుచు॥ మరులు॥

భీమ—(కొంత కఠినముగ) చాలును. ఇక చాలును.

జానకి—(భయపడి తంబుర క్రిందపెట్టి చూచుచుండును)

భీమ—జానకీ! క్రొత్తగ నేర్చుకొంటివా ఈ పాట. నీ కెవ్వరు నేర్పిరి?

జానకి—నా కెవ్వరును నేర్పలేదు. నేనే నేర్చుకొంటిని.

భీమ—పరిహాసమునకు గాదు. నిజముగ.

జానకి—పరిహాసమునకు గాదు. నిజముగనే.

భీమ—అధిక ప్రసంగము.

జానకి—అయ్యో. ఎందు కింతకోపము. ఎందుల కట్లు కనుబొమలు ముడివైచుట!... నిజముగ నెవ్వరును నేర్పలేదు. గ్రామఫోనునందు విని విని నేనే నేర్చుకొంటిని.

భీమ—(లేని నవ్వు తెచ్చుకొని) నన్నెంత మోసగించితివి.

జానకి—ఇందు మోసమేమి. మీరు అనవసరముగ ఆయాస పడితిరి, లేకుండిన నప్పుడే అంతయు చెప్పియుందును.

భీమ—అది యుండనిమ్ము... ఇట్టిపాటలు పాడరాదు.

జానకి—అనగ?

భీమ—అ-న-గ (ఆలోచించుచుండును).

జానకి—పాడరాని పాట లెట్లుండును? శ్రుతి కింపుగనుండిన, అర్థసౌందర్యముండిన పాట పాడరాని దెట్లగును.

భీమ—నేను చెప్పినది నీ కర్థము కాలేదు... కాదు, నేనే నీకర్థమగునట్లు చెప్పలేదు. ఆ పాటయందు రాగస్వరాది దోషము లున్నవనిగాదు. ఆపాటయందలి భావములు యదార్థ ప్రపంచమున సాధారణముగ ఉత్తమ జీవముల అనుభవవేద్యములు గానేరనివి... వాటివలన ముప్పు వాటిల్లును.

జానకి—ఏమి, ఏమి. ఆపాటయందలి భావములు అంత అసాధారణములా? ఎట్లు? . లోకమున మగువలు తమ

ప్రియులకొరకు పరితపింపరా ? పరితపింపరాదా ? ప్రేమయే అనుభవవేద్యము గాకపోయిన ఇక నే భావము అనుభవవేద్యమగును ? . . . ప్రేమవలన ముప్పు వాటిల్లునా ? ప్రేమవలన పిపీలికాది జీవకోటి యంతయు వర్ధిల్లుచున్నదని యందురే.

భీమ—జానకీ ! నీ కింకయు లోకజ్ఞానము చాలదు. కావ్య పఠనము, సంగీతశ్రవణము భవసాగరమును తరించుటకు సరిపోవునా. ఈ పాటలు పద్యములు, నవలలు, నాటకములు, యదార్థము నిరూపించునవి యని అనుకొంటివి గాబోలు. . . లేదు. అవి యన్నియు కవిసమయములపై నాధారపడినవి. అలంకారములే వానిప్రాపు. స్వరూప మెట్టిదో ఎఱుగరాని రసమే వానికి జీవగఱ్ఱ. . . కవిసమయము లనిన ఎట్టివో అని భ్రమ పడవలదు. కవిసమయము లనిన అబద్ధములని అర్థము. (అట్లబద్ధములు గానిచో ఆ భావములు దుష్టములును, పాపభూయిష్ఠములుగను ఉండును) . . ఉదాహారణముగ చూడుము. నీ విప్పుడు పాడిన పాట. . . అందలి భావములు నిజముగ నే పతివ్రతకును ఉండవు. కులటల చిత్తవృత్తిని ప్రకటించు ఆపాట నీవు పాడదగునా ?

జానకీ—అయ్యో. ఏమట్లనుచున్నారు. ఈ పాటయందు గోపికామాధవుల యన్యోన్యప్రేమ చిత్రింపబడి యున్నది

గదా. భగవంతుడగు నందనందనుని చర్యలన్నియు తప్పుల కుప్పలేనా. గోపిక లతని వలచి, అతనికై పరితపించి, విరహాగ్ని దందహ్యలై ఆకులపడినదంతయు కులటలగుటచేతనా? వాసుదేవుడు కులటలపైననా తన ప్రేమామృతవర్షమును గురిపించెను?

భీమ—జానకీ! నీవు మాటలు ఎక్కుడుగ నేర్చుకొంటివి. పత్రికలు చదువుటచే గాబోలు. నీవు చెప్పిన విషయములు వాస్తవములు గావచ్చును గాని ఆ చర్యలకు అర్థము సామాన్యముగాదు. శ్రీకృష్ణావతార తత్త్వ రహస్యము నీకిప్పుడు విపులముగ నుపదేశించుటకు కాలముచాలదు. సమయముగాదు. . . జానకీ. నీవింకను పసిదానవు. ఈ ప్రపంచము మాయామయమని నీ వెఱుగవు. ఈ దేహము క్షణభంగురము, వాయుసంచలిత దీపము. సంసారము అంధకారకూపము. ఐహికసుఖములు గగనకుసుమములు. . . జానకీ! శ్రీ శంకరాచార్యులవారి పేరు వినియున్నావా.

జానకి—వినియున్నాను.

భీమ—ఆ మహాపురుషుడు ఘోషించిన సందేశము విందువా

శ్లో. నళినీదళగతజల మతితరళమ్
తద్వ జ్జీవిత మతిశయ చపలమ్
విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తమ్
లోకం శోకహతం చ సమస్తమ్

భజగోవిందం భజగోవిందం భజగోవిందం మూఢమతే
సంప్రాప్తే సన్నిహితే కాలే నహినహిరక్షతిడుకృఞ్ కరణే.

జానకి——(ఆవులించి) మీ కాఫీసునకు వేళయైనదేమో.

భీమ——(వినిపించుకొనక, తొందరగ) లేదు. . . జానకీ! జానకీ! మానవ స్వభావము ఎప్పుడును తుచ్ఛములైన ఐహికసుఖములనే అపేక్షించును. అస్థిరమైన సంసార సౌఖ్యమే ఆనందప్రదముగ గన్పట్టును. రోగికి మందు పైగాక అనారోగ్యకరములగు పిండివంటలపై తలపు బారునట్లు మానవమాత్రునకు ఆముష్మిక దృష్టికన్న ఇహపరసౌఖ్యదృష్టి సహజము. కామక్రోధ మదమాత్సర్యాదులు అంతశ్శత్రువులు. వానితో గలిసికొని వానిని ప్రోత్సహించు బాహ్యశత్రువులు సౌందర్యాదులు. భర్తృహరి యట్టి మహాజ్ఞాన సంపన్నులు ఈ పరమ సత్యమును గ్రహించియే మనవంటి పామరులకు ప్రకటించియున్నారు. వినుము, సావధానవై,

చర. జలదములోని క్రొమ్మెఱుంగు చాయలు భోగపరంపరల్ మహా
నిలపరిఘట్టితాబ్జదళనీరతుషారము జీవితంబు చం
చలతరముల్ వయోభిమతసౌఖ్యము లీగతినాలకించి స
భ్యులు పరమాత్మయోగమున బుద్ధిఘటింపుడు సత్వరంబుగన్

మాకీయు,)

చం. తెలియక నాశహేతువగు తీవ్రతరానలకీలలోపలన్
శలభము చొచ్చుగాక మతిచాలక మీనము గాలపుం
గ్రానం
గలపిశితంబు తామెసగుగాక యెఱింగియు మేము
దుఃఖదో
హాలవనితాసుఖంబు విడనాడము మోహమహత్త్వ
మెట్టిదో॥

జానకి—ఓహో ఈ భర్తృహరియేనా భార్య తన్ను మోస
గించినదని సన్న్యసించినది. మొన్న 'ఆంధ్రయువతి'
సంచికలో కథ చదివితిని.

భీమ—ఆ దిక్కుమాలిన పత్రికలలోని పుక్కిటి పురాణము
లను మరచిపొమ్ము. అద్భుతవైరాగ్యభావము లుప్ప
తిల్లునట్టి యతని శతకమును పలుమారు పఠింపుము. . .
జానకీ! మోక్షసాధనమునకు వైరాగ్యము మొదటి
మెట్టు. ఐహికసుఖేచ్ఛ విడనాడినగాని మోక్షమార్గము
లభింపదు. ధనలోభము, సౌందర్యపిపాస అన్నియును
త్యజించినగాని ముక్తి చేకూరదు. మోహాంధ
కారమున మునిగియున్నంతకాలము కైవల్యము అగ
మ్యమగును.

జానకి—నిజముగనా? . . . లోకమునందలి సౌందర్యము,
సంతోషము, ఔత్సుక్యము—అంతయు పాపభూయిష్ఠ
మేనా?

భీమ—అవును. జ్ఞానవంతున కవియన్నియు బుద్బుదప్రాయములనియు, అస్థిరములనియు, మానవుని మోక్షమార్గమునుండి త్రిప్పివేయునవి యనియు పాపకార్యాచరణమునకు ముఖ్యకారణము లనియు విదితమగుచుండును. . . . జానకీ! ఏమది, నీ పెదవు లట్లదురుచున్నవి? . . కన్ను లట్లు చంచలించుచున్నవి? నీ దేహమంతయు నట్లు స్పందించుచున్నది? . . ఏల?

జానకి—క్షమింపుడు. . . . నాకేమియును అర్థమగుటలేదు. భయమగుచున్నది. . . లోకమునందలి సౌందర్యమంతయు పాపభూయిష్ఠమా? భగవంతుని సృష్టియంతయు ఆనందస్వరూపమనుకొంటినే. . .మీరు అంతయు విషపూరితమనుచున్నారే. . . అయ్యో సంపూర్ణవికసిత సౌభాగ్యంపు గర్వమున విఱ్ఱవీగుచు పరిమళము యథేచ్ఛగ వెదజల్లుచు, నవ్వుగుల్కు గులాబీపువ్వు పాపాత్మకమేనా? అవ్యక్తమధురశ్రుతిని ఆలపించు సెలయేటిపాట—అకలంకమై, ఆర్ద్రమై, ఆహ్లాదదాయకమైన నిండు పున్నమనాటి పండువెన్నెల—స్వరరాగతాలాది బంధనములు లేకయు శ్రావ్యమైన పక్షుల స్వచ్ఛందగానము—చిన్నిబాలుని చిరుతనవ్వు—లేత కోమలి సిగ్గరపు నవ్వు—ప్రౌఢయువతి సింగారంపు నవ్వు—అన్నియును హేయములేనా? . . భగవంతుడు లోకమునంతయు సౌందర్యముతో నేల ముంచివేసినాడు? సుదతుల యధరములకన్న నెఱ్ఱని కెంపులను-

కెంపులకు తలవంపులుసేయు మగువల మోవులను—నీలములను నిరసించు నీరదమ్ములను-- నీరదములను పటాపంచలుసేయు నీలములను--ఏల నిర్మించినాడు ?. . మానవుని యానందమునకై గాదా? . . కడుపార భుజించినప్పటి సంతృప్తి, నిర్మల నదీ ప్రవాహమున స్నానమాడినప్పటి వికాసము, ప్రియుల అన్యోన్యపరిష్వంగ సౌఖ్యము, బిడ్డల ముద్దుమాటలు వినునప్పటి సంతోషము--అన్నియును పాపాత్మకములేనా ?

భీమ—అవును, అవును, అవును. మోక్షసాధనమునకు పరోధములు గాన అట్లె అగును.

జానకి—అయిన భగవంతుడు పాపకృత్యాచరణ సాధనములుగనే వీటిని సృజించినాడా ?

భీమ—కాదు. అవియును ఒక విధముగ మోక్షప్రాప్తికి అనుకూలములే. ఎట్లంటివా? అట్టి యైహిక సుఖంబులను త్యజించి ఆముష్మికదృష్టి యలవడినగాని మోక్షాసక్తి జనింపదు. ఈ నీవు వర్ణించిన సుందర వస్తువులు మానవుని యనుభవమునకై గావు సృష్టింపబడినవి. మానవుని నిగ్రహశక్తిని, జితేంద్రియత్వమును పరీక్ష సేయుటకు . . . కైవల్యసిద్ధికి జితేంద్రియత్వము అత్యావశ్యకము సుమా.

జానకి—ఎంత విపరీతము. ఈ యనంతసృష్టి ఎంతవ్యర్థము ? జితేంద్రియత్వమా ? . . అనిన--భగవత్ ప్రసాదితము

లయిన నయనములను భగవచ్ఛృష్టి యందలి సౌంద ర్యములను తిలకించుటకై ఉపయోగింపక, గంతలు కట్టుకొను మందురా? స్వరరాగసుధారసయుతగాన మాధుర్యమును గ్రోలకుండునట్లు వీనులలో సీసముపోసి కొమ్మందురా? దైవనిర్మితమైన యీ సుందరదేహ మును పోషించి పూజింపక, శుష్కింపజేసి, మోడై మగ్గనిమ్మందురా?.. పోసింకు. అట్లు చేయగలమ నుకొనుడు... అట్టి వైరాగ్యము, సన్న్యాసమువలన గల్గు లాభమేమి? మోక్షమన నేమి? అందలి యానందమేమి?

భీమ—దివ్యానందము. బ్రహ్మానందము. సర్వదా భగవంతు నితో నైక్యమొందియుండినప్పుడు కల్గు యోగానం దము.

జానకి—ఎల్లప్పుడును భగవంతునితో నైక్యమందియున్నచో ఆనందమేమియుండును? ఈ లోకమున మనము జన్మిం చిన దెందులకు?

భీమ—జానకీ! జానకీ! నీ వింకను పసిదానవు. జ్ఞానమల వడలేదు. బోధించినను అర్థముగాదు... అవకతవక పుస్తకములనుండి అసందర్భపుమాటలు గొన్ని నేర్చు కొని, నోటికివచ్చినట్లు పల్కుచున్నావు. నీకు పారమార్థికచింత ఆవంతయులేదు. అయినను వంత లేదు. కొంతకాలమునకు తానంతవచ్చును.

జానకి—(కపటపు వాక్యములు వినకయే, పొగాలున) ఔను కాని మీరింత వేదాంతము మాట్లాడుచున్నారు గద. మొన్నరాత్రి పాలు తెచ్చిచ్చుటకు కొంత ఆలస్యమై నప్పుడును, నిన్నటిదినము బాదముపప్పులు లేకపోయి నందుకును ఏల అంత కోపగించితిరి. అంత తొందర పడితిరి.

భీమ—అట్టి స్వల్పవిషయముల కేమిగాని,

జానకి—మామా! మీరెందులకు ప్రతిదినమును ఏదియో మందు పుచ్చుకొనుచుందురు. బలముకొరకా.

భీమ—బలమా! ఎవరికి? ఎందులకు? నేను బలహీనుడ నైన గదా!

జానకి—(చిరునగవుతో వింతగ జూచును)

భీమ—వేళ అయినది...ఇక వెళ్లెదను...జాగ్రత్త. ఎక్కడికిని పోవలదు. ఉబుసుపోకుండిన అదిగో క్రొత్తగ భగవ ద్గీత తెచ్చితిని. ఆంధ్రతాత్పర్య సహితముగ నున్నది. చదువుకొనుము. ఆఫీసున నాపని ముగిసినంతనే వచ్చెదను.

జానకి—అట్లే రండు...మధ్యాహ్నమున మన రాము అతని స్నేహితులు వత్తురనుకొందును. నేడు సెలవుగదా. వచ్చి టిఫిను పుచ్చుకొమ్మని కబురుపంపితిని.

భీమ—సరే...కాని వారిని త్వరలో పంపివేయుము. విద్యా భ్యాసమునకు అంతరాయము గల్గును.

జానకి—వారు మాత్రము ఉందురా! వారి యాటలపై అపేక్షచే నిలువమన్నను నిలువరు.

భీమ—(నిష్క్రమించును.)

జానకి—(సోఫాపై చెక్కిట చేయిజేర్చి తలపోయుచు కూర్చుండును. (వీధిలో బిచ్చగాని పాట శ్రావ్యముగ వినవచ్చును) గాత్ర మెంత మార్దవము! వానికి భగవంతుడు ఎట్టి గొప్ప వరము ప్రసాదించినాడు...[ఉలికిపడి] కాదు. కాదు. అట్లు కాదట)..లోకమంతయు పాపమయమట. మానవులను పాపకూపములో బడ ద్రోయుట కేనట భగవంతుడు సౌందర్యమును సృజించినది!..(..ఈ పాటయు పాడదగినదో కాదో)..... [తొందరగ, నిశితముగ] అట్లుకాదు, కాదు. నేను నమ్మజాలను. ఇంత సౌందర్యము, స్వారస్యము, సౌకుమార్యము, సౌహార్ద్రిత, సౌభాగ్యము, సౌరభము శ్మశానముపాలు కానేరదు. ఇంత సృష్టి ఇట్లు వ్యర్థమని గణించుట భగవంతుని పరిహసించుట—అవమానించుట!..[మరల నెప్పటివలె కూర్చుండి కనుగవ మూసికొను. హఠాత్తుగ లేచి హార్మోనియముకడ కూర్చుండి వాయించుచు పాడును].

[పాట ముగిసినంతనే,...హార్మోనియముపై తలపెట్టుకొని ఏడ్చుచుండును.]

[యవనిక]

రంగము 4: క్రిందిరంగము నందువలెనే.

[ప్రవేశము సోఫాపై కూర్చుండి జానకి]

**జానకి**—(చదువుచున్న పుస్తకము మూసివైచి) అనురాగము ప్రథమ సందర్శన జనితమని ఎవరో ప్రఖ్యాతాంగ్లేయ కవిసార్వభౌముడు వ్రాక్రుచ్చెనట...అతడు మానవ హృదయ మర్మముల నెంత బాగుగ నెఱిగినవాడు!... ఆనందము నొసగు అనురాగము దుష్టమెట్లగును? ఏమో, నాకు తెలియని రహస్యమున్నదేమో. పసి దానను గదా. అనుభవజ్ఞానములు సున్నగదా. (నిట్టూర్పు విడిచి) ఏమో, ఈవేదాంతమహిమ నాకేమియు బోధపడుట లేదు. కోపము మానవుని శత్రువులలో నొకటియని ఉపన్యసింతురు; గాని చీటికి మాటికి ధుమధుమ లాడుచు కొట్టుటకు సిద్ధమగుదురు ...ఆ యుపాధ్యాయశిరోమణియు నట్లే. ఎల్లప్పుడును రామకృష్ణ, వివేకానంద యని వాగుచుండును. ఇంటిలో, రామరామ, మనుమరాలీడు పిల్లకు కోకలు గట్టి కులుకుచుండును...ఛీ...ఇవంతయు గాంచినపుడు నాకు వైరాగ్యచింత ఉదయించుచున్నది. గాని సంఫుల్లమల్లికా స్తబకములను గాంచినప్పుడును, విమల వీణాగానము వినునప్పుడును ఆచింత ఎక్కడికో ఎగిరి పోవును. ప్రేమస్వరూపమును స్మరించినప్పుడు ఒడ

లంతయు పులకరించును. లోక మానందమయమని తోచును...

అమల కమల మధ్యే
విమల నీహార మధ్యే
బాజే ప్రేమ బాజే

కవిచంద్రా! ప్రేమ నావంటి నిర్భాగ్యురాండ్ర జీవనము లందు నృత్యముసేయదు సుమా. (కండ్ల నీరుంచును.)

[ప్రవేశము అజీం]

అజీం—అమ్మగారు! చిన్నయ్యగారు వచ్చియున్నారు.

జానకి—రమ్మనుము. ఒంటరిగనా వచ్చియున్నారు?

అజీం—అవునండి.

జానకి—ఇంత మర్యాద ఎందుకు, నాతోవచ్చి చెప్పవలెనా

అజీం—అయ్యగారే చెప్పమనిరి.

జానకి—వెళ్లుము.

(అజీం నిష్క్రమించును.)

[ప్రవేశము రామచంద్రుడు]

రామూ! రమ్ము...ఎక్కడ నేర్చుకొంటివి క్రొత్త మర్యాదులు.

రామ—జాన...(అనబోయి) అమ్మా!

జానకి—(విసుగుతో) అబ్బ! ఈ బలవంతపు వరుసలను కట్టి

పెట్టరాదా. నన్ను పంద్రెండేండ్లు 'జానకీ' అని పిలిచితివి. ఇప్పుడు మాత్రమేమి పుట్టిమునిగినది? జానకీ యనియే పిలువుము.

రామ—నీ యిష్టము. మర్యాదకొరకు నౌకరు దగ్గర కబురు పంపలేదు. రావచ్చునో లేదో అని యనుమానించితిని.

జానకి—(నవ్వుచు) టక్కరివి...ఎక్కడ నీ మిత్రరత్నములు.

రామ—మరచితిని. వారు తమమాటగ నీతో విన్నవించుకొమ్మనిరి. వారు నేటి మధ్యాహ్నము క్రికెట్టు ఆటయందు పాల్గొనవలెను. ఆకారణమున మీయింట విందుగుడుచు భాగ్యమునకు దూరులైరి. పాపము, రాధాపతి మిక్కిలి పరితాపమందెను.

జానకి—పోనిమ్ము. నీవైనను నాపిలుపు నిరాకరింపక వచ్చితివి...లేకుండిన మీపేరు చెప్పి చేసినవంటకములన్నియు నేనే తినవలసి వచ్చియుండును.

రామ—అయ్యో! ఎంతపొరబాటు జరిగినది. అట్లగునని ఎరిగినచో నేను సైతము రాకుందునే?

జానకి—గతజలసేతుబంధనము. చేసిన నేరమునకు అనుభవింపక తీరదు...(లేచి) పత్రికలను చూచుచుండుము. ఇప్పుడే వత్తును.

(నిష్క్రమించును.)

రామ—(పత్రికల నోకొక్కటిగ చూచుచు) జానకికి చదువునం దభిలాష తగ్గలేదు సరిగదా ఎక్కువైనది. (లేచి ఇటునటి తిరుగి, మరల సోఫాపై కూర్చుండును.)

[ప్రవేశము జానకి పళ్లెరమున ఫలహారములతో]

జానకి—(అందిచ్చుచు) ఇవిగో...పంచరత్నములు...ఉండ్రా ళ్లపై నీకు భ్రమ లేదని తేనైతిని...ఇవి ...ండును తీపువి. ఇవి రెండు కారపువి...ఇది కమ్మ నిది... (అని వేర్వేర చూపును)

రామ—(తీసికొని) ఆంగ్లేయ పద్ధతి ప్రకారము కృతజ్ఞతాపూర్వక వందనముల నర్పింపవలెనా.

జానకి—అవసరము లేదు.

రామ—(తినుచుండును. జానకి తదేకదృష్టితో నతని జూచుచుండును.)

జానకి—(రామ. తినుట చాలింపబోవు సమయమునకు) ఓహెూహెూ! ఎంతమర్యాద! ఎంత ఆభిజాత్యము!

రామ—ఏమి యేమి?

జానకి—ఏమియు లేదు...నీ పని కానిమ్ము. సరసన గూర్చున్న వారికి గౌరవార్థమైనను కొంత అర్పింపక యే సర్వమును భక్షించుట ఎట్టి సన్మానము.

రామ—(సిగ్గుతో) క్షమింపవలెను...నీవప్పుడే భుజించి యుందువని అనుకొంటిని.

జానకి—(నిట్టూర్పు విడిచి) నాకెప్పుడును ఆకలిగనుండును. (నవ్వుచు) పరిహాసమున కంటిని. పాపము...నిజముగ నీవింత యిష్టముతో తినుట గాంచుటచేతనే నాకడుపు నిండినట్లైనది...

రామ—(తిని, పళ్లెము క్రిందపెట్టును).

జానకి—అవిగో కిటికీ వద్ద నున్నవి నీళ్లు

రామ—(లేచి, చేతులు కడిగికొని, తిరిగి వచ్చుచు హార్మోనియము వద్ద కొంతసేపు నిలువబడి, వచ్చి కూర్చుండును)

జానకి—రామూ! నీకు పాటయందాసక్తి మెండుగదా... ఎన్నిదినములైనది నీ గొంతు విని...ఏదీ ఒకపాట పాడరాదా

రామ—(సిగ్గుపడును)

జానకి—సిగ్గెందులకు? నేను హార్మోనియమున శ్రుతి పెట్టెదను. పాడెదవా?

రామ—ఏమో.

జానకి—(శ్రుతిపెట్టును)

రామ—ఏమి పాడుమందువు?

జానకి—ఏవైన పద్యములు పాడుము. వైరాగ్యశతకములోనివి తప్ప

రామ—ఆ॥ పెక్కుదివియలున్న జక్కవచెలియున్న
రిక్కరాయడున్నఁ జుక్కలున్నఁ
జిన్నిలేడి చూడ్కి చేడియ నెడఁబాయు
నప్పు డంధకారమయ్యె జగము॥

జానకి—(చప్పట్లు దట్టుచు) శహబాష్...మరియొకటి...
ఏగ్రంథములోని దీపద్యము.

రామ—తెలియదా. భర్తృహరి శృంగారశతకములోనిది.

జానకి—ఎట్లెట్లు? భర్తృహరియా, వైరాగ్యశతకము
వ్రాసినవాడేనా?

రామ—అవును నీతిశృంగారవైరాగ్య శతకత్రయకర్త.

జానకి—(స్వగతము) ఎంత మోసము. ఆయన నాకాసం
గతి చెప్పలేదు.

రామ—ఏమంటివి?

జానకి—ఏమియులేదు. మరియొక పద్యము.

రామ—ఏది చదువుదును......కానిమ్ముది. మొన్న చాటు
పద్య మణిమంజరిలో చూచితిని.

ఉ॥ హా జలజాక్షి హాకిసలయాధర హాహరిమధ్య హాశర
ద్రాజనిభాస్య హాసురశశాంకకలానిధి యెంగుబోయితే
రాజమహేంద్రవీధి కవిరాజు నమం గికురించి భర్గకం
ఠాజిత కాలకూట ఘటికాంచితమైన యమాసచీకటిన్॥

జానకి—ఇది యెట్టి పద్యము? ఎవరు రచించిరి? స్వచ
రిత్రాన్వయముగ గన్పట్టెడిని.

రామ—చక్కగ నూహించితివి. శ్రీనాథకవి రాజమహేంద్రవరపు భామ యొకతె తన్ను మోసగించిపోయి నప్పుడు నుడివిన పద్యమని ప్రతీతి.

జానకి—ఆఁ ఆఁ శ్రీనాథుని వంటి కవిసార్వభౌముఁడు విషయలంపటుడా, పాపకర్ముడా !

రామ—పాపము పుణ్యము భగవంతు డెఱుగును గాని శ్రీనాథుడు మాత్రము రసికావతంసుడే.

జానకి—జ్ఞానులు రసికత్వమును పాపాత్మకమని నిరసింతురు గదా.

రామ—ఈ వెఱ్ఱి వేదాంతము నీకెవ్వరు నేర్పిరి ?

జానకి—అది యుండనిమ్ము...నీకు జావళీలు వచ్చునా ?

రామ—రావు. నేర్చుకొనుటకు వీలు లేకపోయినది గాని విని యానందింపగలను—నీవు పాడినచో.

జానకి—నాకు కీర్తనలకన్న జావళీలనిన నభిలాష.

రాగము. శంకరాభరణము

(పాడును) నేనే జాణ నేర్చినదాన॥నేనే॥

విద్య గల్గినచోట, బుద్ధిమంచిదిగాదు

విద్యబుద్ధులు గల్గ వితరణలేదు॥

రామ—(మృదుస్వరముతో) జానకీ ! ఎంతమధురముగ బాడితివి. కలదుగదా సుధారసము కంజదళాక్షుల

ముద్దుబల్కు_లక అని కవి తెలివిమాలియనలేదు.

జానకి—ఈ సొగసుమాట లెక్క_డనేర్చుకొంటివి...ఇంకొక పాట పాడుదునా.

రామ—(చేతిగడియారము చూచుకొని) జానకీ! క్షమింపుము. నాలుగు ఘంటలకు వత్తునని నాస్నేహితులతో చెప్పివచ్చితిని. మాట నిలుపుకొనవలదా. అప్పుడే నాలుగైనది.

జానకి—(విచారముతో) అట్లు పరుగెత్తి పోవలెనని సంకల్పించుకొనియుండు నిన్ను ఇంకెట్లు సంకెలలు వైచియుంతును. పొమ్ము.

రామ—జానకీ! మరల నట్లంటివేని నామనసు నొప్పింతువు.

జానకి—లేదు, లేదు...వెళ్లుము.

రామ—(లేచి, పోవుచు, నిష్క్రమింప బోవుటకు ముందు తిరిగి చూచును. జానకి ఏడ్చుచుండును.)

జానకీ! (మెల్లన సమీపించి ప్రక్క_గూర్చుండి) జానకీ! ఏమిది? ఈ కన్నీరెందులకు...కోపమువచ్చినదా? ...ఏల యీరోదనము?...చెప్పవా. (అని చేతులు పట్టుకొనును)

జానకి—చెప్పవలెనా? తెలియదా. (అని హఠాత్తుగ కౌగిలించుకొని) తెలియదా? (పాట) జాలమేల

రామ—(కౌగిలించుకొని) తెలిసినది.

[ప్రవేశము భీమరావు]

[జానకి రామచంద్రులు దిగ్గున లేచి నిలుతురు.]

భీమ——(జానకిని లోనికి బొమ్మని సంజ్ఞచేయును. జానకి నిష్క్రమించును.)

(రామచంద్రుని వంక తిరిగి) రామూ! ఇచ్చట ఏమి చేయుచుంటివి?

రామ——మిత్రసహితముగ నన్ను ఫలాహారము బుచ్చుకొను కొనుటకు రమ్మని జానకి కబురుపంపెను.

భీమ——ఎవరు?

రామ——జానకి

భీమ——ఓహో! తరువాత.

రామ——మిత్రులు కార్యాంతరముచే రాలేదు. నేను మాత్రము వచ్చితిని. ఒసగినది భుజించితిని... వెళ్లిపోవు చున్నప్పుడు జానకి రోదనము సేయుచుండుట గాంచి సమీపించి ప్రశ్నించితిని...ఆ వెనుక మీరెఱుంగుదురు. తప్పు చేసితినని ఒప్పుకొందును.

భీమ——ఓహో......(ఇటునటు తిరిగి) వెళ్లిపొమ్ము.

రామ——(రెండడుగులు వెనుకకు బోయి) తప్పేనాయది.

భీమ——వెళ్లిపొమ్ము...నీ హాస్టెలుకు వెళ్లిపొమ్ము.

(రాను. నిష్క్రమించును.)

నీవు వెళ్లిపోయిన మాత్రాన అంతయు చక్కబడునా? ...దవానలము నందనవనమున బయలు దేరినది... ఆర్పుటెట్లు...ఆర్పుటెట్లు...ఆర్పకుండిన దహించి వేయును...

[ప్రవేశము: అజీము]

ఎవరది?

అజీం—స్వామీ! చిన్నయ్యగారు ఉత్తరీయమును మరచి వచ్చినారట. తెమ్మని బంపిరి.

(అని తీసికొని నిష్క్రమించును.)

భీమ—ఏమిచేయుదును? ఏమిచేయుదును? (ఇటునటు ఆలోచనామగ్నుడై పచారు చేయుచుండును.)

[ప్రవేశము జానకి వెనుకనుండి]

నందనవనమున దవానలమును ఆర్పియే వేయవలెను. ఆర్పియే తీరవలెను.

జానకి—ఆఁ ఆఁ ఏమిసేయుదురు? రామచంద్రుని ఏమిసేయుదురు.

భీమ—(తిరిగి, కఠినముగ) నేరమొనర్చిన వాని నేమి సేయుదురు? ఘోరపాప మొనర్చినవాని నేమిసేయవలెను? శిక్షింతురు. శిక్షింపవలెను. శిక్షింతును.

జానకి—ఎట్లు?

భీమ—కలాశాల యధికారులతో చెప్పి హాస్టెల్ నుండి తరుమ గొట్టింతును. కలాశాల నుండి బహిష్కరింప జేయుదును. ఈ యూరు వదలునట్లు సేయుదును...

జానకి—అయ్యో, నిష్కారణముగ అన్యాయముగ బాలుని విద్యాభ్యాసమంతయును నాశన మొనరింతురా? భవిష్యత్తు నంతయు కాల్చివేయుదురా?

భీమ—చేతనైన అంతయు కాల్చివైతును.

జానకి—అంత దుష్కార్యమునకు పాల్పడుదురా? అంతపాపమున కొడిగట్టుదురా.

భీమ—అవును. ఏమి సేయుట. అంతకును కారణభూతురాలవు నీవే..

జానకి—ఆహాహా. అంతటికి కారణభూతులెవ్వరో దైవమెఱుగును...(మెల్లగ) మీరును ఎఱుగుదురు.

భీమ—ఈదౌర్భాగ్యపు ప్రసంగము లోనికి దైవము నెందులకు లాగెదవు. కారణభూతు లెవ్వరైనను సరియే తగిన శిక్ష దోషి అనుభవించియే తీరవలెను.

జానకి—(తటాలున) అనుభవించియే తీరవలెనా? (మరల మెల్లగ దీనముగ) పోనిండు. నేను మరల వానిని జూడనని వాగ్దాన మొనర్చిన శిక్షింపకుందురా? అప్పుడు మీ యభీష్టము నెరవేరునుగదా.

భీమ—అభీష్టము లేదు, గిభీష్టములేదు. ఆ కలుషాత్ముని దండించియే తీరుదును.

జానకి—(కనులు విప్పి, నాసాపుటంబు లదర) లేదు. దండింపకూడదు. దండింపజాలరు.

భీమ—(విభ్రాంతుడై) ఏమి యీ యధికప్రసంగము. ఈ యవిధేయత. ఈ గుండెనిబ్బరము. నన్నెదిరించి ఇట్లు మాట్లాడుటకు నీకెక్కడనుండి వచ్చినదీధైర్యము? వ్యవహారము ముదురుచున్నది. జానకీ జాగ్రత్త.

జానకి—(వికటముగ నవ్వుచు) నాకు భయములేదు. మీరేమిచేసినను చేసికొనుడు...అయిన నొక్క సత్కార్యము మాత్రము చేసివచ్చెదను. లోకమునకు ఇప్పుడే మీలోనిగుట్టు, మీయంతర్జీవనము, అంతయు చెప్పివచ్చెదను. మీ రహస్యవేదనలు, మీపటుత్వార్జన ప్రయత్నములు, మీలేహ్యములు, మీభస్మములు, మీ యనుప్రాసములు, మీదురాశలు, మీ నిరాశలు, విపులముగ వర్ణించి ఇరుగు పొరుగు వారిని కొంత ఆనందింపజేసెదను...

భీమ—(తత్తరముతో) జానకీ, జానకీ, ఎవరు చెప్పిరి నీకిదంతయు.

జానకి—(అపహసించి) ఆకాశవాణి చెప్పినది. అరుంధతి చెప్పినది. లేదు లేదు, మీకు బ్రహ్మానందమొసగునే

ఆ భగవంతుడు నాకు కించిత్తు బుద్ధిప్రసాదించినాడు ...మీరు లేనప్పుడు వచ్చిన పార్శిళ్ల పైని పేర్లు చదువుటకు వలసిన విద్య మాయమ్మయే నేర్పినది... దైవమిచ్చిన కన్నులను గట్టిగ మూసికొనుట కింకను వేదాంతము పట్టువడలేదు...

భీమ—(జానకి చేతులు పట్టుకొని) జానకీ! జానకీ! ఇవి చేతులు గావు. కాళ్లు...నాయాన—నీ వెల్లు సెప్పిన నట్లుచేతును...నామానము గాపాడుము.

జానకి—(హేళనముగ జూచుచు చిరునవ్వు నవ్వును.)

[యవనిక]

---

# అంకము. 2

రంగము. 1. పురుషోత్తమసంతులుగారి గృహము.

[ప్రవేశము పంతులుగారు, ముగ్గురు విద్యార్థులతో మాట్లాడుచు]

పంతులు—స్వామినాథం! చందా ఎంత పోగయినది?

స్వామినాథం—సుమారు వందరూపాయలండి. మా తండ్రి గారు ఇరువది రూపాయలు ఇచ్చినారు.

పంతులు—(సంతోషముతో) అట్టి దేశోపకారు లుండినచో మన భారతమాత్ర కేమి కొదువ? ఏవీ, రూపాయలు తెచ్చితివా. పుష్పములు, ఫలములు మొదలగు వస్తువుల కిప్పుడే ఆర్డరు ఒసగవలెను.

వెంకట్రావు—పంతులుగారూ! మా తోటలో రకరకముల పుష్పము లున్నవి. మా చెల్లెలు దండలు గ్రుచ్చెద నన్నది.

పంతులు—శ్రీ రామకృష్ణపరమహంసజయంతి మహావైభవముగ జరుగువలెను. ఇంట్లో దేవతార్చన అనుకొన్నావా. (తనలో) వచ్చు స్వల్ప కమీషను కూడ రాకుండు టెందుకు?

స్వామి—మీవద్ద నెంత ఇమ్మనెదరు? ఇరువది చాలునా?

పంతులు—ఎంత? ఇరువదియా! ఏమూలకు? పూలదండలకే చాలదే...ఇక వచ్చినవారికి ఫలములు, తాంబూలములు.

వెంక—ఇరువది రూపాయలా? ఎన్నిదండలు కావలెనండీ.

పంతులు—కుఱ్ఱవాడవు నీకేమి తెలియును. చూడుము. ప్రిన్సిపల్ గారికి ఒకటి, ట్రస్టీలు నల్గురికి నాలుగు, బహుశః డైరక్టరుగారు వచ్చిన వత్తురు. కనుక, అధమపక్షము ఐదైనను గావలెను.

చంద్రశేఖరము—బలే! పంతులుగారు ప్రధానపాత్రమునే మరచిపోయినారు. శ్రీ పరమహంస పటమునకు గావలసిన దండ లెక్కలోనికి రాలేదు.

పంతులు—ఓరీ! ఎంత అసాధ్యుడవు. మాటవరుసకు చెప్పిన లెక్కలో తప్పులు వెతకుచున్నావా?

చంద్ర—క్షమింపుడు...పోగైన డబ్బు ఎట్లో వ్యయమగుట గదా ప్రధానము.

పంతులు—నాగస్వరమున కేర్పాట్లు చేయవలెను గాబోలు.

చంద్ర—తప్పక. ఇంతధనవ్యయముతో జరుపునప్పుడు కొంత ఆడంబరమైనను లేనియెడల పరమహంస యాత్మ తృప్తినొందునా.......

పంతులు—ఊరుకొనుము. ఎప్పుడును వెక్కిరింపే. స్వామినాథం! మరచిపోతిమి. సాయంత్రము సభ జఱుగ

వలెను గదా. ఉపన్యాసకుల నెవ్వరిని నిర్ణయించు కొనలేదు. అధ్యక్షుడుగ మన ప్రిన్సిపల్ గారే ఉందురు. ఎవరైనను ఈవిషయముపై ప్రసంగింపగల "దొరలు" ఉన్నారా.

వెంకట్రావు—పంతులుగారు! ఆ విషయమై సర్వమును సిద్ధ పరుపబడినది. శ్రీమతి విశాలక్షి దేవిగారు ఉపన్యసింతురు. మీ రనినట్లు ప్రిన్సిపాల్ గారు అధ్యక్షత వహింతురు.

పంతులు—ఎట్లెట్లు? విశాలాక్షియా? ఆడుదియా. ఏడ్చిన ట్లున్నది. అడుది ఉపన్యసించుటయు మనయట్టి మగ వారందఱు చేతులు మోడ్చుకొని ఆలకించి ఆమోదించుటయా. ఏ శంత ఏర్పాటుచేసినా డిట్లు?

చంద్ర—మీరంత యాక్షేపణ సేయుచో మీ యభిప్రాయ మును ప్రిన్సిపాల్ గారికి విన్నవించెదము. వారే శ్రీమతి విశాలాక్షి దేవిగారిని ఉపన్యసింపుమని ప్రార్థించిరి. ఇప్పుడుమాత్రమేమి. మీమాటగ వారికి చెప్పినట్ల యిన ఆపివేయుదురేమో. వెంకట్రావు! రమ్ము.

పంతులు—ఆగు, ఆగు. ఎంత నీతిమాలినపని. ఒక్క అబలా మణిని ఉపన్యసింపుమని ప్రార్థించి ఇట్లు అవమానింప వచ్చునా. ఛీ. మన భారతదేశము ఈగతికివచ్చుటకు ముఖ్యకారణము మనము స్త్రీలను గౌరవింపకుంటయే.

వెంకట్రావు—(నవ్వుకొనుచు) మీయట్టివారు దేశనాయకులుగ నుండవలసినవారు తప్పి ఉపాధ్యాయులైతిరి.

పంతులు—విధి!

ప్రవేశము. రాజ్యలక్ష్మి.

రాజ్య—భోజనము సిద్ధమై చాలకాలమైనది. మడిగట్టుకొనరా. నా కాకలియగుచున్నది.

పంతులు—సరి లే! నీవు వెళ్ళిపొమ్ము...త్వరగా వచ్చెదను. (రాజ్యలక్ష్మి బాలురవంక తేరిజూచుచు మెల్లగ నిష్క్రమించును.)

పంతులు—మీకు ఆలస్యమైనట్లున్నది. ఇక వెళ్లుడు, స్వామినాథం! ఏవీ, రూపాయలు.

స్వామి—అన్నియు రూపాయలుగ లేవు. కొంత చిల్లర.

పంతులు—దమ్మిడీలైనను చింతలేదు.

స్వామి—(జేబీనుండి సంచిదీసి, లెక్కపెట్టుచు పంతులుగారికి ఇచ్చుచుండును. ఆసమయమున క్రింది సంభాషణ జరుగును)

వెంక—(చంద్ర. తో) తీర్చిన ముత్యమురా.

చంద్ర—తేర్చిన తేనెయని చప్పరింపలేదు...రక్షించితివి.

వెంక—పెండ్లియైనట్లున్నది!...ఎవ్వడో భాగ్యవంతుడు!

చంద్ర—అఘోరించినట్లున్నది. మన పంతులుగారి భార్యరా.

వెంక—ఛీ. పాపము. కన్నులు పోవును.

చంద్ర—పాపముచేసినవానికి కన్నులుపోవునో లేవో గాని తెలివిలేనివానికి కన్నులున్నను పోయినవానితో సమానములే.

వెంక—నిజముగనా. మనపంతులుగారికి ఏబది దాటినదిగదా.

చంద్ర—ఆహా...ఇది తృతీయ వివాహము.

వెంక—నీవు పరిహాసము చేయుచున్నావు. (పంతులుగారితో) పంతులుగారూ! ఇప్పుడిక్కడకువచ్చి వెళ్లిన అమ్మాయి తమ మనుమరాలానండీ!

పంతులు—చాల్చాలు! వెంకట్రావు! బుద్ధిమంతుడ వనుకొంటిని. పరస్త్రీలను కన్నెత్తిజూచుట బుద్ధిమంతునకు లక్షణముగాదు...ఆవిడ నీకు తల్లితో సమానము. గురుపత్ని.

వెంక—(ఆశ్చర్యముతో) క్షమింపుడు. అన్యథాతలపవలదు.

పంతులు—ఇక పొండు. సాయంత్రమునకు గలసికొందము.

(బాలురు నిష్క్రమింతురు.)

[ప్రవేశము. రాజ్యలక్ష్మి]

రాజ్య—వచ్చినవారు వెళ్లిపోయిరిగదా. ఇక వత్తురా.

పంతులు—అట్లే, ఇంతవఱకు ఇచ్చటనే యుంటివా.

రాజ్య—అవును...సరిగంచు పట్టుబట్ట గట్టుకొని, చేతికి రత్నాలయుంగరము బెట్టుకొనియుండిన ఆ బాలుడెవడు?

పంతులు—ఓహో! స్వామినాథమా. అతడు దుబాష్ రత్నవేలుమొదల్యారి కొడుకు. మొదలియార్లు అనగా మన బ్రాహ్మణులకన్న మిక్కిలి తక్కువ జాతివారు. మనది మొదటివర్ణము. వారిది నాల్గవవర్ణము.

రాజ్య—అయిన—మనకన్న అతడే మంచి బట్టలు గట్టుకొన్నాడే...మీ బావకొడుకు వెంకడికన్న నితడే ఎంతో అందముగ నున్నాడే.

పంతులు—అదిగాదు. నీకు వర్ణభేదములు, వాటి యర్థము తెలియవు.

రాజ్య—మీరు చెప్పుడు. నేర్చుకొందును.

పంతులు—అందులకు భగవద్గీత, మనుస్మృతి, మొదలగు గ్రంథముల సారాంశము చెప్పవలెను. ఇప్పుడు వలదు.

రాజ్య—సరే, (అని యాలోచించుచుండును).

పంతులు—రాజ్యం! నీకు మంచిబట్టలు, నగలు అనిన ఇష్టముగదా.

రాజ్య—అవును.

పంతులు—నాకు తెలియును. నీ కన్నియు కొనిపెట్టెదను. వింతవింత యల్లికల సరిగంచు చైనాపట్టుచీరలు కొని తెచ్చెదను. నీ బంగారు శరీరముపై రంగారునట్ట సింగారపు కరాచీ చీరలు తెచ్చియిచ్చెను. ఏదీ చెయ్యి (అని చేయిగ్రహించి) ఇదిగో! ఈ చేతికి, ఈ చిన్న వ్రేలికి ఒక కమలపుటుంగరము, ఈ చిట్టివ్రేలికి నీలాలు

పొదిగిన యుంగరము, ఈ బుచ్చివ్రేలికి కెంపుపచ్చల పాముటుంగరము—ఈచేతులకు రకరకముల గాజులు, చెవులకు—నీకు కెంపు లిష్టమా, రవ లిష్టమా.

రాజ్య—(విసుగుతో)ఏమో. నే నేమి ఎఱుగుదును?

పంతులు—పోనిమ్ము. రెండు జతలు. కెంపుల దొకటి, రవల దొకటి. ఒడ్డాణము, చెక్కిన పతకముతో...అన్నియు కొనియిచ్చెదను. త్వరలో.

రాజ్య—ఎట్లు? మనవద్ద ధనమున్న గదా.

పంతులు—(నవ్వుచు) ఎంత అమాయికరాలవు. ధనములేక యే ఇవన్నియు వచ్చునా? ధనముతోనే కొనిత్తును. నే నార్జింపబోవు ధనముతో కొనిత్తును.

రాజ్య—ఎట్లు? ఎట్లు సంపాదింతురు?

పంతులు—అట్లడుగుము, చెప్పెదను గాని రహస్యముగ నుంచుకొనుము. క్రిందటిమాసము మా పాఠశాలకు డైరక్టరుగారు వచ్చియుండిరి. ఎఱుగుదువు గదా... అప్పుడే...ఆ సమయమున నేమిచేసితి ననుకొంటివి. బాలురకడ చందాపోగుచేసి మంచి గులాబీ మాలను వారికి సమర్పించితిని. శతావధాన్లు శతభిషం. శేషాచార్యులుగారు గాంధిగారిపై జెప్పిన పంచరత్నములను కొన్ని సవరింపులుచేసి, వారి నుద్దేశించి చదివించితిని. ఎవ్వరితో చెప్పకుము. ఖరీదైన సిగరెట్లడబ్బా కొని బంగాళాకు బంపితిని...నా శక్తికి, నా బుద్ధివిశేషము

నకు, నా పద్ధతులకు డైరక్టరుగారు మెచ్చిరి. అమం దానందము చెందిరి... వెళ్లిపోవునపుడు "ఏదో మీ సేవకుని కొక ఇన్‌స్పెక్టర్ పదవి దయచేసిన ఆచంద్ర తారార్కము మీపేరు మరవ" నని మనవిచేసుకొం టిని. వారు గంభీరముగ మందహాసముచేసి వెళ్లిరి. అనగా, నాకోరిక శీఘ్రకాలములో తీరును. నాప్రయ త్నము సఫలమగును. ఇక ఇన్‌స్పెక్టరునైతినా... నాపంట పండినట్లే.) నాయాజ్ఞకు లోబడి నౌఖర్లు దం డము లిడుచు పరుగెత్తుచుందురు. చిన్న గుఱ్ఱపుబండి ఏర్పాటుచేసుకొందును. ముందొకబంటు. వెనుకనొక బంటు. ఇన్‌స్పెక్టరుగారు వచ్చుచున్నారనిన గందర గోళముగాదా...ఇక ధనమార్జించుట సునాయాసము. ఏమి, రాజ్యం! అప్పుడు నీవు పెద్ద గొప్పింటి ముత్తై దువగుదువు. రాజ్యలక్ష్మమ్మగారనిన భక్తి, గౌర వము, పలుకుబడి.....అప్పటికి మనకు సంతతిగల్గును. చిన్నారి పొన్నారి చిరుతపాపలు; ముద్దులొలుకుచు, వచ్చియు రాని తప్పటడుగులతో మనలను ముప్పాతి ప్పలుపెట్టి, ముదమునొసంగు బిడ్డలు పుట్టుదురు. వా రితో నీవు బండిపై షికారుపోవచ్చును. రాజ్యం. బిడ్డలతో నాడుకొనెదవా ?

రాజ్య—(ఇంతవరకు పరధ్యానముతో వినుచుండినది). నాకు బిడ్డలు వలదు. బిడ్డలనిన విసుగుగా నుండును. నాకు

బాలురతో నాడుకొనవలెనని యుండును. నాకు చిన్నప్పుడు చెల్లెక్కుటయనిన నిష్టము. మాయింటిప్రక్క నుండిన సుందరేశునితో—ఇంతముం దిచ్చటికి వచ్చి యుండెనే ఆ మొదలారిబాలుని పోలికనే ఉండెడి వాడు—ఇద్దరము గలసి యెల్లప్పుడును ఆడుకొను చుండువారము.

[ప్రవేశము. తిమ్మయ్య]

తిమ్మ—(ప్రకటనకాగితము చదువుచు, పంతులుగారినిచూచి మానివేయును).

పంతులు—తిమ్మయ్యా, ఏమది.

తిమ్మ—ఏమీలేదండి. బెజవాడకంపెనీవారి నాటకప్రకటన.

రాజ్య—నాటకమా? తెలుగేనా.

తిమ్మ—అవును. తెలుగేనమ్మా. గొప్ప నటకులు పాత్రలను ధరింతురట.

రాజ్య—ఏమి నాటకము (కాగితము తీసికొనును)

తిమ్మ—సారంగధర నాటకము.

పంతులు—ఛీ!

రాజ్య—(ప్రకటన చదువుచు) "ప్రఖ్యాత నాటకము! ... విషాదరసవంతము! ...అనేక బిరుదములను, బంగారు పతకములను పొందిన నటశిఖామణులు, ముఖ్యపాత్రలను ధరింతురు...క్రొత్తసీనులు!...ఫార్సీమెట్లు!.

(సంతోషముతో) ఎంత మంచియూట! తప్పకపోవలెను.

పంతులు—రాజ్యం! నీవు చూడవలెననిన యెంత మంచి నాటకములు లేవు. రామాయణ మహాభారత నాటకములు, హరిశ్చంద్ర, ప్రహ్లాద, మొదలైనవి ... ఛీ! ఈ నాటకము దుష్టనాటకము. కథ నీతిబాహ్యమైనది. పరువు, మర్యాదగల సత్పురుషులు ఎవ్వరు ఇట్టి నాటకములకు వెళ్లరు. నీవు వెళ్లరాదు.

రాజ్య—అంత చెడ్డనాటకమా ఇది? ఏదీ కథ యేమో చెప్పుడు. అంత చెడ్డనాటకము నాడినచో సత్పురుషులు రారంటిరి గదా. అప్పుడు కంపెనీవారికి నష్టము గదా, ఏల ఆడుదురు?...అది పోనిండు. మొదట కథ చెప్పుడు.

తిమ్మ—కథ యెప్పుడును వినలేదటమ్మా...అనగ ననగ రాజరాజనరేంద్రు డను నొక ముసలిరాజు. అతనికి రత్నాంగి యను భార్య. సారంగధరుడను కొడుకు... కొన్నాళ్ళకు ఒక పడుచుభార్యను చిత్రాంగి యనుదానిని వివాహమాడెను.

రాజ్య—ఎందుకో? ... తరువాత.

పంతులు—తిమ్మయ్యా (అని యాపి) చూడు! మొన్న షాపులో కొనితెచ్చిన నగిషీపని సోఫా తీసుకొనిరమ్ము. (తిమ్మయ్య వెళ్లి ఒక ప్రాతసోఫా తెచ్చును).

పంతులు—రాజ్యం! ఇటురమ్ము (అని చేయిపట్టుకొని సోఫా

పైకూర్చుండబెట్టుకుని, తాను గూర్చుండి, పకపక నవ్వి, భుజములెగురవైచి) తిమ్మయ్యా! దంపతుల మెట్లున్నాము?

తిమ్మ—ఓహోహో! ఏమి పొందిక! ఏమి యందము! ఏమి తీరు! లోకులు చూచిన దృష్టిదోషము తగులును. ఆ యొద్దిక, ఆ యీడుజోడు... నేను వర్ణించిన నేమి బాగుండును. కవిగారు చూచిన ఒక శతకము వ్రాసియుందురే.

పంతులు—తిమ్మయ్యా. నాకు పద్యాలు గిద్యాలు కావలె ననుకొంటివా? నీయట్టి విశ్వాసముగలవారు సంతోషించిన చాలును... మే మిర్వురము జంటగ కూర్చుండిన నెవరివలె నున్నాము?

తిమ్మయ్య—ఓహో! సాక్షాత్తు పార్వతీ పరమేశ్వరులవలె, నల దమయంతులవలె, ద్రౌపదీ ధర్మరాజులవలె...

రాజ్య—ద్రౌపదికి ఐదుగురు భర్త లుండిరట, నిజమేనా?

పంతులు—(విననట్లు) తిమ్మయ్యా! నీవన్నట్లు దృష్టితగుల వచ్చును. ఏమో యెవరికం డ్లెట్లుండునో? మంచికండ్లతో చూచినను దృష్టితగులును. (అనిలేచి) రాజ్యం! కొంత పనియున్నది తిమ్మయ్యతో. త్వరగా వత్తును. నీవు పొమ్మ. (రాజ్య. పోవుచుండ) రాజ్యం! చూడు! అంతగ నీకు ఆకలియైన భుజింపుము... తప్పులేదు.

రాజ్య—(ఆవులించుచు, వెళ్లిపోవును).

పంతులు—తిమ్మయ్యా! ఏమి, నాయభీష్టము నెరవేరునా?

తిమ్మ—ఏమోనండి. భగవంతునిదయ. మంత్రసానమ్మదగ్గఱ ఔషధము తెచ్చినాను. (ఇటునటుచూచి, జేబీనుండి సీసాదీసి) ఇదిగోనండి. పదిచుక్కలు ఆహార పదార్థ ములతో గలిపి దినము ఇమ్మని చెప్పినది.

పంతులు—మంత్రసాని కనుభవ మెక్కుడు. ఎట్లో ఔషధ ప్రభావముచే, దైవకృపతో, మా రాజ్యము కాపుర మునకు వచ్చి...ఏదో...సంతానము గలిగెనా -- నీకు మంచి బహుమతి నియ్యకపోను.

తిమ్మ—చిత్తము. పంతులుగారు. (పోవుచు, మరలివచ్చి) (మెల్లగ) ఇందువలన అపాయ మేమి యుండదు గదండి! తెలియక అడిగినాను.

పంతులు—(వీపున చరచుచు) ఎంత పిరికివాడవు నీవు. నాకు రాజ్యంపై గల ప్రేమ సామాన్యమనుకొన్నావా? ...ఇదిమాత్రము,—రాజ్యం సౌఖ్యము నిమిత్తమే గదా....చూడుము...ఈ సీసా నీయొద్దనే యుంచు కొని, భద్రముగ వంటవానికి నిచ్చి, మజ్జిగలోనో, పాలలోనో, కలిపి, ఇప్పించుము...పొమ్ము...

(తిమ్మయ్య నిష్క్రమించును)

ఓహో! నా యీప్సితార్థము త్వరలో సమకూ రును. ఇక నేమికావలెను...క్రొత్తగ వికసించిన కమ లము దొరికిన భ్రమరమునకు ఇంక ఏమికావలెను.

(నిష్క్రమించును).

రంగము 2. మునుపటి రంగమునవలెనే.

[పురుషోత్తము పంతులు, భీమరావు, మాట్లాడుచుందురు]

పంతులు—నిజముగనా?

భీమ—అబద్ధమైనచో నా సర్వస్వము నిచ్చివేయనా? అబద్ధమని కల్పించుకొనుటకును అశక్యము.

పంతులు—ఎంత ఘోరము! ... నీవు చెప్పుచుండినపుడు నా చెవులు వినుచుండెను గాని బుద్ధి సంపూర్ణముగ గ్రహించుచుండినదిగాదు. కొంతివఱకు కథయనుకొంటిని, నాటకమేమో యని తలచితిని ... మరికొంతకాలమునకు ఎప్పుడో నెవ్వరికో జఱిగిన యుదంతమని యెంచితిని...ఎట్లెట్లు? నీకు ఇట్టి పరాభవము సంభవించినదని యెట్లు నమ్ముదును...అయ్యో. వార్ధక్యములో నెట్టి దుఃఖము?

భీమ—వార్ధక్యమా? ఎవరికి? నీకా, నాకా?

పంతులు—(చిరునవ్వుతో) ఇద్దరికి.

భీమ—పురుషోత్తం. స్నేహితుడవని పరుగిడివచ్చితిని. ఇదియా నీ చేయు సాహాయ్యము.

పంతులు—భీమరావు! నీకు మతి స్థిరములేదు. అట్లు వాయువేగముగ బోయిన నేమి లాభము.

భీమ—చిరకాలమునుండియు ఇట్టి దురవస్థ యెదో ప్రాప్తించు

ననుభయము హృదయాంతరమున వెతబెట్టుచునే యుండెడిది గాని, రామ రామ, సాక్షాత్తుగ ఈవిధమున పరిణమించునని నాదుస్స్వప్నములందును గోచరింపలేదు.

పంతులు—ఉత్తర ప్రత్యుత్తరము లేవైనను జరిగినవా?

భీమ—ఏమి తెలియును! ఈ యగాధకూపము లోతు ఎవరు గాంచినారు?...కన్నులార జూచినది చాలదా?

పంతులు—నీవు పొరబడి యుండకూడదా...నీ భార్యయనిన నెవ్వరో దూరపు బాంధవ్యము గాదు నీ మేనకోడలే గదా...చిన్నప్పటినుండియు నీ కుమారునకు పరిచయమున్నది. చనువుచొప్పున అట్లుండి యుండవచ్చునేమో...ఆలోచించితివా. ఆతురపడి అసందర్భపు కార్య మొనరించిన వెనుక చింతించిన లాభముండదు.

భీమ—ఎక్కడ నేర్చుకొంటి వీన్యాయవాది తంత్రములు... అంతమాత్రము గ్రహింపనేరని మూఢుడుగాడీ భీమరావు...వేయేల. ఆదోషియే తనదోషమును ఒప్పుకొనెను. ఇంకేమి కావలెను?

పంతులు—అంతమాత్రమున అనుమితమును నిశ్చయించుకొనుట పాడిగాదు. భయముచే తబ్బిబ్బుపడి లేని నేరమును తమపై మోపుకొను చంచలచిత్తులు లేరనుకొన్నావా.

భీమ—అయ్యో ఎంత చెప్పినను నమ్మకున్నావు... నేను వచ్చినప్పుడు ఇర్వురును ఒక్కసోఫాపై కూర్చుండి (గద్గద స్వరముతో) కౌగిలించుకొని యుండిరి... చూచిన మాత్రాన ఇర్వురను ఈ చేతులతో నిర్మూలన మొనరించక ఎట్లుంటినో నాకైన తెలియకున్నది. ఆశ్చర్యము! కోపముతో నైనను మండిపడలేదు. బిగ్గరగ నరువలేదు. ఖండింపలేదు, దండింపలేదు. హృదయము భ్రాంతిపడి అచేతనమై యుండెననుకొందును... లేదు. అప్పటినుండి నిద్రపోయినది, చిత్తము చెదరిపోయినది. బుద్ధి బుగ్గియైపోయినది. అవ్యక్తమైన ఆవేదన ఆత్మనే తినివేయుచున్నది.... ఏమి చేయుటకు తోచుటలేదు.

పంతులు—క్షమింపుము. నీయవస్థ ఇప్పుడు గ్రహించితిని ...చెడిపోయినది చక్కజేసికొనుటకు ప్రయత్నింపవలెను గాని ఇట్లు నిరాశపాలు గావచ్చునా.

భీమ—నిజముగనా? చక్కబడునా? ఇంకెక్కడ చక్కబడుట. పీడి పంకములోబడి నలిగి మలినమైన పుష్పమును శిరముదాల్చు టెక్కడ?

పంతులు—మిత్రమా! ఉపమానములు కావ్యములలో తప్ప మనజీవితములకు నుపకరింపవు సుమా... చెడిపోయినది, చెడిపోయినదని నెత్తిగొట్టుకొనిన ప్రయోజనములేదు. ఏమియు చెడలేదు... ఇది యొకవిధ

మైన మనోవికారపు లక్షణములు. మగువలకు వివాహానంతరము కొంతకాలమునకు సంతానము గలుగుట సహజము, ప్రకృతి ధర్మము...అట్లు కలుగమి ధర్మవిరుద్ధమగుటచే చిత్తవృత్తి అసాధారణముగ నుండి వివిధవికారములకు హేతువగును...ఇదియు నట్టి వికారమే...

భీమ—ఏమో...ఉండవచ్చు ననుకొనెదను...అయిన నీవు చెప్పునదేమి.

పంతులు—ఈ వికారముల బాపగల యౌషధము సంతాన ప్రాప్తియే. అదియే మోక్షసాధనము.

భీమ—అట్లా? చెప్పుటకు సులభముగనున్నది. కృతకృత్యుడనగుటయు అంతసులభమే అగునా?...సర్వము మన చేతిలో లేదే.

పంతులు—లెస్సగ నుడివితివి. ఈకార్యము భగవంతుని చేతిలోనిది...పిచ్చివాడా, ఎందులకీ యాలోచన... తత్క్షణమే భార్యతో గలిసి రామేశ్వరయాత్ర సల్పుము. నాగప్రతిష్ఠ చేయుము...నీ యభీష్టము తప్పక సిద్ధించును...ఇంకను సందియమా?...మన అహోబల శాస్త్రులగారి సంగతి మరచిపోతివా. డెబ్బది యవ పడిలో, కాటికి కాళ్లు చాచుకొని యున్న వాడు—దారాసమేతముగ రామేశ్వరయాత్ర సల్పి

వచ్చి సంవత్సరము తిరుగకమునుపే చక్కని పుత్రుని బడయలేదా.

భీమ—ఔను. భగవదనుగ్రహము. ఇప్పటి ప్రకృతిశాస్త్రములకు నలవిగాని మాహాత్మ్యము లెందులకు ఉండ రాదు?...అయిన రామేశ్వరమే గతి యందువా?

పంతులు—నిత్యశంకితుడు సర్వదా దుఃఖభాజనుడు.

భీమ—లేదు. నీత్రోవ నాకు నచ్చినది...రామేశ్వరయాత్ర అవశ్య మనుసరణీయము...పైమాసమునుండి సెలవు పుచ్చుకొందును...ఇప్పుడు జ్ఞాపకమునకు వచ్చినది. జానకి యొకమారు తీర్థయాత్రావాంఛ తెల్పినది. తప్పకవచ్చును...ధన మధికముగ వ్యయమగునా?

పంతులు—కాదు...ఎందుల కంతయు సవిస్తరముగ నిప్పుడే కనుగొనెదము...తిమ్మయ్యా! తిమ్మయ్యా!...ఎస్. ఐ. ఆర్. గైడు...త్వరగా...

(తిమ్మయ్య గ్రంథము తీసికొనివచ్చును.)

(పంతులు, భీమరావు పుటలు తిరుగ వైచుచుందురు.)

[యవనిక]

---

## రంగము 3. వీథి.

[ప్రవేశము భోగము చంద్రరేఖ పాడుచు,

"మేలుకొను మో భరత పుత్రక"...]

చంద్ర—(ప్రకటన కాగితములు పథికులకు బంచిపెట్టుచుండును)

[ప్రవేశము 5-గురు బాటసార్లు.]

1-వ బాటసారి—(నోటీసు పుచ్చుకొని) ఏమి? కళావంతుల సభ! ఉపన్యాసకులు. సంఘోద్ధారక. శోభనాద్రిరావుగారా!...పనిలేని మంగలవాడు. (అని గొణుగుచు, కాగితము నలిపివేయుచు నిష్క్రమించును.)

2-వ బాట—(కాగితము పుచ్చుకొని, జేబీలోని చుట్టలు పైకితీసి కాకితములో చుట్టి మరల జేబీలో నుంచుకొని నిష్క్రమించును.)

3-వ బాట—(ఆంగ్లేయపద్ధతిని దుస్తులు ధరించినవాడు... కాగితము పుచ్చుకొని Thank you, madam. లెక్చరా?...తెలుగులోనా? Sorry.

(నిష్క్రమించును.)

4-వ బాట—(కాగితము చదువుకొని 5-వ బాటసారితో) ఒరే! లింగం! కళావంతులనిన నెవ్వరురా? ఈ డిగవాండ్రా కుమ్మరివాండ్రా.

5-వ బాట—(చంద్రరేఖ వంక జూచుచు) కళావంతులనిన భోగమువారురా.

4-వ బాట—భోగమువారికి ఆపేరు ఎట్లు వచ్చినదిరా?

5-వ బాట—ఏవస్తువుకు ఏపేరు ఎందుకు వచ్చెనో ఎవరు చెప్పగలరు. అట్లే ఇదియు.

4-వ బాట—పోనీ...అయితే భోగమువారి సభ జరుగునా అనగా భోగమువారందరును వత్తురా.

5-వ బాట—వెళ్లి చూడరాదా.

4-వ బాట—ఇంకేమున్నది.

(ఇద్దరు నిష్క్రమింతురు.)

(ఇట్లేపలువురు దారినిబోవుచు నోటీసులుపుచ్చుకొనుచుందురు)

చంద్ర—అబ్బ! అయిపోయినవి నోటీసులు...ఈ సభలు నమ్మేమాత్రము ఉద్ధరింపగలవో దైవమున కెరుక.

(ప్రవేశము భీమరావు)

అదుగో, మాపూర్వస్నేహితుడు భీమరావు.

భీమ—(ఇటునటు జూచి) చంద్రరేఖ! జ్ఞాపకమున్నదా.

చంద్ర—ప్రభువులు మీరు మరచిపోదురు గాని దాసీలము మేము మరువగలమా?

భీమ—యౌవనము వీడినను చాకచక్యము పోలేదు.

చంద్ర—ఏమిప్రయోజనము...యౌవన మున్నప్పుడేగదా చతురతుకు వెలవచ్చును.

భీమ—అది పోనిమ్ము...(రహస్యముగ) చంద్రరేఖ! పూర్వ స్నేహము వలన చనువుచే నడుగుచున్నాడను. రహస్యముగ నుంచుకొనుము...కోమలాంగి హృదయమును, ప్రేమను ఆకర్షించుటకు మచ్చుమందు నీవేదైన నెఱుగుదువా.

చంద్ర—(ఆశ్చర్యముతో) వెలయాలా? ఎవతె యాభాగ్యవతి?

భీమ—కాదు, వెలయాలు కాదు.

చంద్ర—వెలయాలేమోయని, ఇంకయు నీకు తత్త్వము బోధపడలేదాయని ఆశ్చర్యపడితిని. ఎక్కువ రొక్కములియ్యక వారకాంత చిక్కదని నీకింకయు పాఠము కాలేదా అనుకొంటిని... వెలయాలు కాదంటిరి... మగనాలా?...అయ్యయ్యో! పంతులుగారు! ఎందుకీపాపము? ఏపురాకృత కర్మఫలమో అనుభవించుచు ఈనుచ్ఛజీవనము గడుపుచున్న మాబోంట్లు ఉన్నారుగదా, వారు చాలరా? ఈపాపములో బలనాశమా

భీమ—మరల పొరబడితివి.

చంద్ర—ఆఁ...వెలయాలుగాక, మగనాలుగాక ఇంకెవ్వరు.

భీమ—(మెల్లగ) ఇల్లాలే.

చంద్ర—(ముక్కుపై వ్రేలిడుకొని) ఎంతమాట....ఎంత పిచ్చివారు మీరు!...ఇన్నిదినములకు ఇంతమాత్ర మేనా స్త్రీహృదయ మర్మమును గ్రహింప గల్గితిరి. ధనమొసగి వెలయాలి పదువు సంపాదించుకొనునట్లె ఇల్లాలి యనురాగము ఔషధము లొసగి సంపాదింప తలంచితిరా?...అయ్యయ్యో, స్త్రీజన్మమునకే ఎట్టి తలవంపు! అనురాగము జనించుటకు మందున్నదా? ...మగవారి కెంత బుద్ధిలేదు!...మగువలను మట్టి బొమ్మలవలె కొంతసేపు, వంటలక్కలవలె కొంతసేపు, పశుఘుకక్త్తెలమాడ్కి కొంతసేపు, పరికింతురు. అంతే గదా. క్షేమరావు! సతి కనురాగము జనింపచేయ జాలమి, తప్పు నీయందుండ, ఆయబలకు మందులు బెట్టు టెందులకు? అకట!ఇంతకాలమునకు ఇకనైన స్త్రీలను గౌరవింపరాదా?

భీమ—చంద్రరేఖ! ప్రాతలంజలు లోకమాత లగుదురన్న వాక్యము నేడు నాకు సార్థకమైనది...వెల తగ్గు కొలది వేదాంతము ముదురును గాబోలు.

చంద్ర— మద్దెలపై బడి కోపగించిన ఏమలాభము పంతులు గారు!

(అని నవ్వుచు నిష్క్రమించును.)

భీమ—బుద్ధిమాలి దీని నడిగితిని...ఇక నేమిమార్గము. వేరు గతిలేదు...పురుషోత్తముని యుపదేశమే ఉత్తమము ...రామేశ్వరమే గతి...రామేశ్వరమే గతి.

(నిష్క్రమించును.)

---

రంగము 4: హాస్టెల్ నందలి హాలు.

[గదియంతయు రామకృష్ణ జయంతికై అలంకరింపబడి యున్నది. బాలు రనేకులు కూర్చుందురు. నాగస్వరము. వెనుక గద్దియపైకి ప్రవేశము రామచంద్రుడు ప్రిన్సిపాల్, పురుషోత్తం పంతులు, శ్రీమతి విశాలాక్షి మొదలగువారు]
Enter with song. (street)

[విశాలాక్షిగారు ఉపన్యసింతురు, వెనుక అధ్యక్షుని
Prayer x. x x
వచనము. పుష్పఫలాదులు సభ్యులకు పంచిపెట్టుదురు.]

(రామచంద్ర, విశ్వనాథ రాధాపతులు తక్క అందఱు నిష్క్రమింతురు.)

విశ్వ—సభ ముగిసినది...ఆహా! పది నిమిషములకు ముందు ఈగదిలో నెంతజీవకళ యుండినది. ఇప్పు డెట్లు అదృశ్యమై పోయినది. అట్లేగద మహాపట్టణములు, భవనములు, అంతఃపురములును—

రాధా—అవును, వైరాగ్యము మూడువిధములు. శ్మశాన వైరాగ్యము, ప్రసూతి...

విశ్వ—ఎత్తిపొడు పటుండనిమ్ము...నేను చెప్పినది సత్యము గాదా. అడుగుము రామచంద్రుని.

రాధా—అడుగుట నిష్ప్రయోజనము. రామచంద్రుడు

చింతాక్రాంతస్వాంతుడై మౌనము వహించి యున్నా
డు. కారణము మృగ్యము.

విశ్వ—అవును. నీవుచెప్పినంతనే నాకును గన్పట్టినది. రామూ! ఎందులకట్లున్నావు? దేహమున అస్వస్థతగా లేదు గదా?

రామ—(లేదను నర్థముతో తల పంకించును)

రాధా—మా యబ్బాయికి మాటలురావు. లేదా మరచి పోయినాడు.

విశ్వ—పరిహాసము మానుము. రామచంద్ర! ఏల యీ విచారము, ఈ మౌనము?

రామ—(ఊరకుండును.)

రాధా—మర్యాదగ నడుగుచున్నాను. వెనుక నీయిష్టము.

విశ్వ—రామూ! రాధాపతి మాటలు లెక్క సేయకుము... స్నేహితులతో జెప్పుకొనిన దుఃఖము ఉపశమించును. వారు దుఃఖమును మాన్ప యత్నింతురు. దుఃఖ కారణమునుండి చిత్తము నన్యాయత్త మొనర్ప జూతురు... చెప్పుము...ఎందుకట్లున్నావు.

రామ—(ఊరకుండును)

రాధా—విశ్వనాథం! రోగమొకటియైన మందొకటి యొసగిన కుదురునా? మనరామచంద్రునకు మాటలు లోపలనే నిలిచిపోయినవి. ఏమిచేయుదును! రమ్ము

తలక్రిందుగ పట్టుకొని మూడుపర్యాయములు విదిలించిన కోటుకొని వచ్చును.

విశ్వ—ఛీ ఊరుకొనుము.

రాధా—(నవ్వుచు కన్నుగీటుచు) లేదు చూడుము నా యౌషధ ప్రభావము.

(అని రామచంద్రుని పట్టుకొనును. విశ్వనాథము ముందు కొంత వెనుకదీయుచు, ఇంకొకవైపు పట్టుకొనును. రామచంద్రుడు వదలించుకొనుటకు ప్రయత్నించును. కోటు సగము వీడివచ్చును.)

విశ్వ—కోటు చిరుగగలదు. జాగ్రత్త.

రాధా—అట్లైన కోటు తీసివైచెదను. (అని బలవంతముగ తీసి ప్రక్కనున్న కుర్చీపై పడవేయును. జేబీనుండి యొక 'కవరు' క్రిందపడును.)

రామ—(కవరు తీసికొనుటకు లంఘించును.)

రాధా—(ఇంతలో కవరు గ్రహించి) ఓహో రహస్యము తెలిసినది...రామచంద్రుని చింతకు కారణము తెలిసినది...అది విరహవేదన ఇది ప్రియురాలి యుత్తరము. చదువ వచ్చునా? (అని తెరువబోవును.)

రామ—(కోపముతో) రాధాపతీ! వలదు, వలదు, తక్షణమే నాకిచ్చివేయుము. (అని తీసికొనుట కుద్యుక్తుడగును)

రాధా—(వెనుకకు బోవుచు) చేతజిక్కిన పంతు ఊరక యిత్తునా...ఉత్తరము చదువవలెనని కుతూహలముగ నున్నది.

రామ—రాధాపతి! వలదు, వలదు. పరిహాసమునకు గాదు. తక్షణమే ఇచ్చివేయుము. లేదా, జాగ్రత్త!

రాధా—జాగ్రత్తనా. ఏమి సేయుదువు.

రామ—(భయంకరముగ) చంపివేయుదును.

రాధా—(పకపక నవ్వి) అయ్యో! భయమగుచున్నది. దైవమా! నన్ను రక్షింపుము! అష్టదిక్పతులారా! నాప్రాణములు నిల్పుడు! ఓ పంచభూతములారా! నాకు సాయమురండు...నన్ను మా రామచంద్రుడు చంపివేయునట.

రామ—రాధా! రాధా! వెనుక చింతించిన ఫలము లేదు సుమా. ఇచ్చివేయుము, ఇచ్చివేయుము... పరిహాసము గాదు—నాయాన...చదివితివా చచ్చినట్లే.

రాధా—నిజముగనా. ఈ బెదరింపులు లేకుండిన నప్పుడే ఇచ్చియుందును...ఇక నియ్యను. ఏమిచేయగలవో చూతము. (అని విప్పి చూడబోవును.)

రామ—(హఠాత్తుగ ప్రక్కనున్న గొడుగు తీసికొని)

కాచుకో! (అని బిగ్గరగ నరచి రాధాపతి శిరముపై తీవ్రముగ గొట్టును.)

రాధా—ఆఁ ఆఁ (అని తల చేతితో బట్టుకొని క్రందపడును.)

విశ్వ—(రామచంద్రుని వెనుకప్రక్కగ పట్టుకొని)...రండు! రండు! హత్య! హత్య! స్వామినాథం! వెంకట్రావు! చంద్రా! శంకరం!...రండు రండు...

(ప్రవేశము బాలురు పరుగెత్తుచు)

బాలురు—(అందఱును ఒక్కటే సమయమున) అయ్యో! రాధాపతి!...నెత్తురు, నెత్తురు...డాక్టరుగారికి కబురు ...[illegible]... ఎట్లు జఱిగినది...(ఇత్యాది)—

రామ—(వెఱ్ఱివానివలె రాధాపతి వంక జూచుచుండును) విశ్వనాథము, వెంకట్రావు, చెరి యొకచేయి పట్టుకొందురు.)

(శంకరం మొదలగువారు రాధాపతి కుపచరించుచుందురు.)

[ప్రవేశము పురుషోత్తమపంతులు]

పంతులు—ఏమిది? ఏమిది. గందరగోళము...పోట్లాటలా తమాషాలా...(అని, యదార్థము గోచరించి నంతనే) అయ్యో...రామచంద్రుడు...రాధాపతిని ...ఎంత ఘోరము...(ఇంతలో బాలురు రాధాపతిని స్ట్రెచ్చెర్ పై బెట్టి గొనిపోవుదురు)...విశ్వనాథం! ఏమిది? నాటకమా...ఏమి కారణము...పొండు.

అందఱు పొండు...సిగ్గులచేటు!...(బాలురు వెళ్లిపోవు దురు.)విశ్వనాథం! నీకు తెలిసియుండును.ఎట్లు జఱిగినది?

విశ్వ—(కొంతసేపూరకుండి) ఇంకను నాకన్నులతో గాంచి నది నాకే నమ్మకము లేదు...జయంతిసభ జఱుగు చుండి నప్పటినుండియే రామచంద్రుడు చింతాక్రాంతుడై యుండెను. సభ ముగిసిన యనంతరము కారణ మడిగితిని. మౌనమే వహించెను. రాధాపతి పరి హాసమునకు తలక్రిందుగ పట్టుకొని విదిలించిన మాట్లాడునని యత్నము సేయదొడగెను. నేనును తోడ్పడితిని. కోటు చిరుగునేమో యను భయమున తీసి పారవైచితిమి. అప్పుడు జేబినుండి కవరొకటి జాఱెను...అదిగో అచ్చటనే యున్నది ఆదౌర్భా గ్యపు కవరు. రాధాపతి తన యెప్పటి కొంటెతన ముతో నదిప్రియురాలి యుత్తరమని పరిహసించి విప్పి చూడబోయెను...ఆశ్చర్యకరముగ—రామచంద్రుడు మాత్రము వలదని ఎంతయో వారించెను. ప్రార్థిం చెను, బెదరించెను. రాధాపతి వినడాయెను. అం తయే. హఠాత్తుగ దెబ్బ! రాధాపతి క్రిందపడెను. ఏమియు తోచక రామచంద్రుని చేతులు పట్టుకొని బిగ్గరగ కేకలిడితిని. బాలురందఱు వచ్చిరి. మీా రును వచ్చితిరి.

పంతులు—(కవరు క్రిందనుండి తీసుకొని) విశ్వనాథం! వెం

కట్టావు! ఇక వెళ్లి పొండు. జరిగినది మరచి పొండు. నాటకములో నొక రంగ మనుకొనుడు.

(విశ్వ. వెంక. నిష్క్రమింతురు.)

రామచంద్రా!

రామ—(విసుగుతో) అబ్బ! నాకు తెలియును. నేను చేసి నది తప్పని తెలియనంతటి మూర్ఖుడనుగాను. నేనొన ర్చిన కార్యము అతినుష్టమైనదని మీరు ఉపన్యసింప నావశ్యకము లేదు.

పంతులు—ఓహో! ఇంకయు నాగ్రహము వీడినట్లు లేదు ...రామచంద్ర! ఇంత రౌద్రరసమును నిష్పత్తి చేయుచున్న యీలేఖ ఎట్టిదో కనుగొనవలెనని యున్నది...చదువవచ్చునా?

రామ—అయ్యా! ప్రార్థింతును. వేడుకొందును వలదు. చదువవలదు...నాయుత్తరము నాకిచ్చివేయుడు. బల వంతముగ చదువుట న్యాయమా?

పంతులు—నీవు నాకేమియు న్యాయములు నేర్ప నక్కర లేదు. రామచంద్ర! ఎవ్వరు వ్రాసిన దీయుత్తరము.

రామ—(ఊరకొనును.)

పంతులు—భయములేదు. చెప్పుము.

రామ—మా జానకి—నాసవతితల్లి...వ్రాసినది.

పంతులు—(బిత్తరవోయి చూచుచుండును.)

[యవనిక]

# అంకము. 3

రంగము. 1. భీమరావుగారి గృహము.

[ప్రవేశము పురుషోత్తమ పంతులు, భీమరావు.]

భీమ—తరువాత, తరువాత.

పంతులు—తరువాతనేమి? ఆభయంకరమూర్తి నీ కుమారుడని ఎన్నటికిని నమ్మజాలను. ఏపిశాచమో, భూతమో, ఏసైతానో అతని నావేశించి యుండవలెను. ఆలేఖ నొసగలేదను కారణలేశమున హంతాత్మగ, అన్యాయముగ తనబాల్యస్నేహితుని నిర్దోషిని కత్తితో చావమోదెను...ప్రక్కనున్న బాలురను నేనును పట్టుకొనకుండినచో నింకయు నెన్నిహత్యలొనర్చియుండునో అని భయమగుచున్నది.

భీమ—ఉత్తరము చదివితివా? అందెట్టి కలుషవాక్యము లున్నవో!

పంతులు—చదువలేదు...నిర్భయముగ వాడాలేఖ తన సవతితల్లి వ్రాసినదని చెప్పినంతనే నానోటితడి యారిపోయెను...నీకీవిషయము సవిమర్శకముగ చెప్పి నీ యంగీకారముతో గాని చదువుట తప్పని యెంచి అనుమానించితిని...ఇదిగో కవరు...(విప్పిజూచి) ఇదిగో చిత్రపటము!

భీమ—(తీసికొని) దురాత్ముఁడు (అని చింపివైచును)

పంతులు—ఇదిగో లేఖ. (ఇయ్యబోవును)

భీమ—వలదు, నీవే చదువుము. ఎంతపాప మొనర్చితినో ఆవాక్యములు వినవలసి వచ్చినది. ఇక చదువుట గూడ నెందులకు.

పంతులు—(చదువుచు) "రామచంద్రునకు నీప్రియమైన జానకి"...

భీమ—(తొందరగా నిటునటు పచారు చేయుచుండును.)

పంతులు—"ఎన్నిదినములైనవి నిన్నుజూచి, నీతో మాటలాడి. ఆనాడు నీవుపాడిన పద్యములు నాకింకయు కలలో వినబడుచున్నవి."

భీమ—నాకు తెలియును, నాకు తెలియును.

పంతులు—"నీకు జావళీలనిన ఇష్టమంటివిగాని పట్టుమని యొకటి యైనను పూర్తిగ వినవైతివి. క్రొత్తవి నేర్చుకొంటిని"...

భీమ—ఆపాడు పాటలే కొంపదీసినవి. గానము భక్తికి గానప్పుడు అనర్థదాయకము.

పంతులు—తుదవరకు విని వెనుక మాట్లాడుము..."కమలము మిత్రసందర్శనము లేక బ్రతుకజాలదు. అట్లె నిన్నుచూడక నీజానకి".....ఎంతసాహసము!

భీమ—(చెవులు మూసుకొని) రామ! రామ! ఎంత మహా పాప మాచరించితినో గద పూర్వజన్మమున ఈ దురి తములు విని బ్రతుకవలసి నందులకు!... మిత్రమా. ఇంకెంతని భరింతును...అహింసా ధర్మమును పాలింప కంకణము గట్టుకొన్న బ్రాహ్మణుడ నైతినిగాని లేని చో ఈక్షణమున ఆకలుషాత్ముని పరిమార్చి యుండ వలదా...ఇప్పుడేమి చేయుదును...దవానలము నం దనవనమును భస్మము చేసివేయుచున్నది. ఇంకయును ముక్కుమూసుకొని ఊరకొమ్మందువా?

పంతులు—భీమరావు! నిన్ను జూచిన నాకు జాలివొడము చున్నది. నీవు భరింపరాని వేదన సహించుచున్నా వని ఎఱుగక కాదు, గాని ఆపద గోచరించినంత శీఘ్రముగనే తప్పించుకొను నుపాయము గోచరిం చునా? రోగము వచ్చునంత సులభముగ మందు కుదుర్చునా?...ఏమి చేసెదవు...వెల్లడిచేయు విష యము కాదు గదా. కడుపు చించుకొనిన కాళ్ళపై బడును.

భీమ—ఏమైనగాని ఆపాతకి ముఖము నేనెట్లు చూడగలను? వాడును నేనును ఒక్కయూర నుండుట ఇక నసంభవ మనుకొమ్ము.....చచ్చిన భగవంతునకు వంద నము లర్పింతును.

పంతులు—ఆఁ ఆఁ.

భీమ—బిగ్గరగ నోరుదెరచి అపవారించెద వేల? నా యభిమానము, నావాత్సల్యము ఎప్పుడో నశించినది. నాకు పుత్రుడు లేడు. . .మిత్రమా, కులము చెరుప బుట్టి, ఘోరపాపపంకముతో నాయశశ్చంద్రికను మలినముచేసి, నాయాత్మ శాంతికి దూరమొనర్చిన వాడు మరణించిన నాకు చింతయుండునా?. . .ఈ నా చేతులతో జేయవలెనని సంకల్పించుకొన్న కృత్యము ఆ లోకనాయకుడు సృష్టిలయకారణుడు ఒనర్చినచో విచారమెందులకు?

పంతులు—భీమరావు! ప్రస్తుతము గమనింపుము. ఏమి చేయ నిశ్చయించితివి?

భీమ—నిశ్చయమా! నిశ్చయమా! నిశ్చయమేదియు లేదు. అంతయు చంచలమే. అంతయు వంచనమే.

పంతులు—బాలుని ఎచటికైన పంపివైచెదవా, కాక, నీవే?

భీమ—ఛీ! నేనెందుకు పలాయనము చేయవలెను? నేను దోష మొనర్పలేదే......ఆదోషినే తరిమివేయుదును ...ఏ రంగూనుకో, సింహాళమునకో, పంపివైచి ఆ జన్మము వానిముఖము నవలోకింపను...నాకు తనయుడే లేడనుకొందును.

[ప్రవేశము జానకి హఠాత్తుగ]

జానకి—అట్లెన్నటికిని జఱుగదు...మీరట్లు చేయరు.

భీమ—(అదిరిపడి) ఓహో! అశరీరవాణి...ఓ మహాదేవీ—మహామారీ!...వచ్చితివా. నాకొంపదీసి, నా శాంతి భస్మముచేసి, నాయాత్మ నల్లకల్లోలము సేయుటకు వచ్చితివా?

జానకి—ఏమిది? ఏమి యీ వెఱ్ఱికోపము, ఈ వెకిలి మాటలు!

భీమ—(కోపముతో) పాపాత్మురాలా! భయము లేక సిగ్గు లేక, పతివ్రతవలె మాట్లాడుచున్నావు? (జాబు లాగుకొని, జానకి మొగముపైకి ద్రోసి) చూడుము! చూచి యానందింపుము...తెలిసికొంటివా? రహస్యము బట్టబయలయ్యెనని గ్రహించితివా...బిత్తరవోవుచుంటివి?...పాపము, కొంగులో ముడివైచి యుంచిన దాగునని యెంచితివి గాబోలు...చెప్పుము ఎవరు వ్రాసినదీ జాబు? ఎవరికి?

జానకి—వ్రాసినది నేనే. ఎవరికి వ్రాసితినో మీకు తెలియును...వ్రాసినది తప్పని మీరు పాటించుచో తప్పుచేసిన దానను ఇదిగో నేను. నన్ను శిక్షింపుడు.

భీమ—నీయనుపతికై వేచియుండలేదు...వానినే మొదట

... చు,

దండింతును....వెనుక...ఛీ! నిన్ను—దండించుట యా?...పాపపంకిలము నన్నంటుకొనును...నిన్ను పారవేతును. కుళ్లి, దుర్గంధము వెడలుచున్న పదార్థమును ఏమిసేయుదురు?...చేతితోనైన ముట్టుకొనక చిమ్మివేయుదురు...అట్లె...అట్లె... (బిగ్గరగ) నిన్ను!—నిన్ను తరిమివేయుదును. మరల నాకడప ద్రొక్కనీయను.

జానకి—అత్యుత్తమమైన కార్యము...ఆవెనుక...నేను వదలిపోయిన వెనుక—ఇంకొక చిన్నపిల్లను, పది యేండ్ల పసికూనను—వివాహమాడుదురా?

భీమ—(ఉగ్రముగ) ఓసీ! నీవు వెళ్లిపొమ్ము!...పొమ్ము! పొమ్మనల...నా దృష్టిపథమునుండి పొమ్ము! నీవు స్వరూప మాత్రమున నబలవు గాని నిజముగ పిశాచమవు...నీ పలుకులు నాకు గ్రుచ్చుకొని బాధించుచున్నవి. నీ నెకిలి నవ్వు నాకు వెర్రిపుట్టించుచున్నది ...నీ సౌందర్యము నన్ను దహించివైచుచున్నది... వెళ్లిపొమ్ము.

జానకి—ఊరక వెళ్లిపొమ్మనిన పోజాలను...ఆబాలుని శిక్షింపనని వాగ్దానము చేసినచో పోయెదను. లేనిచో పోజాలను...అంతవరకు తమరు నన్ను దయ్యమని దూషించినను, పిశాచమని భయపడినను వెళ్లను.

భీమ—ఏమీ, వెళ్లవా? నీ కంత పట్టుదలనా? నీకీ

సాహసము ఎట్లు వచ్చినది?. . శిక్షింపనని వాగ్దాన మొనర్చిన గాని నెళ్లనంటివే?. .(నీ కంత సామర్థ్య మున్నదా?) శిక్షించిన నేమి చేయుదువు?

జానకి—(తిరుగబడిన వ్యాఘ్రమువలె) ఏమిచేయుదునా? ఏమిచేయుదును!. . చేతులు జోడించుకొని, మలిన వస్త్రములు ధరించి, వాసెనగట్టు కట్టుకొని నిరస్త భూషనై రోదనము సేయుచుందు ననుకొంటిరి గాబో లును. . సాహసించిన స్త్రీప్రకృతి శక్తి నెఱుగరు గాబోలును. ఛీ! అంతశక్తి కావలయునా. . ఎందు లకు? మీప్రభావమంతయు,—మీ నైపుణ్యము, లోని గుట్టు, మీరుసేయు శివపూజలు, మీరు దూరు దొమ్మరిగుడిసెలు—లోకమునకు సవిస్తరముగ ప్రకటింతునని మున్నొకమారు చెప్పితిని—జ్ఞాపక మున్నదా. ఆప్రతిన ఇప్పుడు నెరవేర్చుకొందును. . . ఇప్పుడు చూచెదను మీధైర్యము, మీపట్టుదల, మీపరాక్రమము—సోదరసోదరీమణులారా! రండు! ఈనాకథ నాలకింపుడు. . వింత కథ—విషాదపు కథ—

భీమ—ఆగుము. ఆగుము

జానకి—ఆగుటయా? పట్టుపట్టిన వనితామణి వాగ్ధార ఆగుటయా. . అది ఆగనేరదు. . లోక మింకయు నెన్నాళ్లు మీకపటనాటకముచే మోసగింపబడును?

సర్వేశ్వరుడు, జగత్కర్త, జగత్పోషకుడు, ప్రసాదించిన సహజపటుత్వ మంతయును విషయలోలురై, కామాంధులై కోలుపోయి—తోక తెగిన నక్కవలె—వేదాంత ముపన్యసించు మీ యట్టి లోకోత్తర జీవనుల యదార్థ జీవితము కొంత ప్రకటించినచో భగవంతుడు నన్ను మెచ్చకుండునా? మీరు మీ లేహ్యములకు, మీ భస్మములకు, ఔషధములకు వ్యయ మొనర్చిన ధనముతో నెందరు బిదసాదలకు, అన్నమో రామచంద్రాయని మలమల మాడు ననదలకు అన్నదాన మొనరించి యుండవచ్చును.

పురు—భీమరావు! సెలవు. . .మరల కలిసికొందును.

(నిష్క్రమింపబోవును.)

జానకి—ఆగుడు! ఆగుడు! తమకు పోవలదు. . .నిలిచి సావధానముగ వినుడు. పసిబాలుని ఏయేవిధముల శిక్షింపదగునో యని ఉపాయములు ఉపదేశించుటకు మాత్రమేనా మీస్నేహము? గుట్టు బయలు బడినప్పుడు పలాయనమా. . .ఏమి మగతనము?

పంతులు—(నిలిచిపోవును.)

జానకి—ఈ యసహ్యపు చర్యయే అనుకొంటిరా. . .ఇది యొక ప్రకరణము. . .మరియొక ప్రకరణము నన్ను హింసించిన విధము. గొప్పనేర మొనర్చిన ఖైదీని సైతము అట్టి నిర్బంధనలకు లోబరుపరు. . .ఇయగు

పోరుగు వారింటికైన వెళ్లనిచ్చితిరి గారు !. . .నాటక ములకు వెళ్లినచో వ్యభిచార మలవడు ననునంత నమ్మకము గదా మీకు మానవతుల శీలములందు . . .మీరొనర్చిన పాపకృత్యములను లోకమునకు నుద్ఘోషించినప్పుడు గదా మీ యథార్థవర్తనము విదితమగును !. . .అప్పుడు గదా పాపపుణ్యములు నిశ్చ యింపబడుట !

భీమ—జానకీ ! జానకీ !. . .నామానము నీమానము గదా. ఏల నాగౌరవమును మట్టిపాలు సేయుదువు. . .ఇంత కాలము మర్యాదతో బ్రతికి—ఈనాటికి—నావార్ధ క్యము సమీపించు నాటికి—నలుగురిలో తలవంపులు నాకేల కలుగజేసెదవు. . . . . .నేను సల్పిన కృత్య ములలో కొన్ని వివేకహీనములే అగుగాక ! కొన్ని వ్యర్థములే అగుగాక !. . .అంతయును నీమీది ప్రేమ చేతనే గదా !. . .జానకీ ! చూడుము. నీ యెదుట నిలిచియున్న—ఈ దౌర్భాగ్యుడు. ఇక నతని జీవిత మంతయు శూన్యమై పోయినది గదా. . .కాదు. . . కాదు. . .శూన్యము గాదు. నిర్భరసంతాపమయ మై పోయినది గదా. . .దీనికి తోడు—గోరుచుట్టు పై రోకటి పోటుగ—ఈపరాభవము దుస్సహమగును. అభిమానమును గోల్పోయిన వెనుక జీవించుటకన్న అధమము వేరులేదు. . .జానకీ ! అట్లు సేయకుము.

నాగతి నింతటికి దెచ్చినది నీవే. నాయాశయము లన్నియు నిరాశల గావించినది నీవే! నాజన్మ మ భాగ్య మొనర్చినది నీవే. . .చూడుము నన్ను. . .నీకు జాలి కలుగ లేదా?. . .

జానకి—ఆహాహా! ఇంకయును స్వాభిమానము, స్వార్థ పరాయణత మానలేదు గదా. ఇంత కాలమునకు మీ జీవితము దుఃఖభాజనమైనదే మీకన్నులకు గట్టుచున్నదా?. . .అబ్బబ్బా! ఓర్చుకొనువారి కీలోకమున నొప్పు గలుగదు. . .(గద్గద స్వరమున). . . నాజీవితము— శిరీషసంకాశకోమలమైన నాయావనము—నవనవోన్మేష మధురములైన నాభావములు ఊరిక లెత్తుచుండిన నాకోరికలు, అన్నియును—ఒక్క క్షణమున, కిరాతునివలె, దయారసము లేక, యోచింపక, జంకక, అనుమానింపక—త్రొక్కి, ముక్కలు చేసివైచితిరే! ఆమాట తలపునకు రాదు గాబోలు . . .వయసున తమకు పుత్రికగ, బాంధవ్యమున మేన కోడలుగ, మెలగుచుండిన నన్ను చేబట్టినప్పుడు నా సౌఖ్యమునే అపేక్షించితిరా. నా యాత్మవికాసము గమనించితిరా?. . .కొండంత కొడుకొకడుండ వార్ధక్యము సమీపించుట ఎఱింగి ఏపారమార్థిక సమస్య పరిపూర్తి సేయుటకు నన్ను పెండ్లియాడితిరి? . . .ఇప్పుడు సత్యము లోకమునకు వెల్లడియగుచో

గల్లు తలవంపులకే భయపడుచున్నారు గాని, నిర్దోషి ని, చెక్కుల పాలుగారు పసిదానను—అన్యాయముగ, అనవసరముగ, అమానుషముగ—యావజ్జీవము ప్రేమదూరమైన అంధకార కూపమున బడద్రోయుటకు భయపడలేరు గాబోలు—ఏమి ధర్మ పాలనము!

భీమ—జానకీ! ఆగుము. నీపలుకులు ములుకులై నన్ను బాధించుచున్నవి. . .నే నొనర్చిన నేరము మహాఘోరమైనది. క్షమింపుము. . .నాయాశ గలదు. . .నీవు కోరినట్లే. . .వానిని దండింపను.

జానకి—ఓహో! నాజన్మము ధన్యమైనది. . .ఇక నాకు సెలవిండు.

భీమ—ఏమిది? అట్లనుచున్నావు.

జానకి—నాయభీష్టము నెరవేరినది. . .నాకిక జీవితముపై నాశలేదు. . . మీాకిల్లాలుగ నిక నుండుట అసంభవము గదా.

పంతులు—ఎక్కడకు వెళ్లిపోవుదువు?

జానకి—అట్టి సందేహములు మానుడు. . .ఇక నాకు సంసార మార్గము దూరమైపోయినది. . .ఈ యనంత ప్రపంచమున నాకు నిలువ నీడ యుండదా?

భీమ—జానకీ! ఎంతమాటంటివి! నేను బ్రతికి యున్నప్పుడే

నీకిట్టి పాట్లా. . .నీయిచ్ఛ వచ్చి నట్లుండుము. ఇలు వదలి మాత్రము పోవలదు.

జానకి—ఇచ్చటనే యుండుమనియా మీయాజ్ఞ ?

భీమ—లేదు. . .నామనవి, నాప్రార్థన. . .

జానకి—(యోచించి) పోనిండు. అట్లె యగుగాక. అయిన నొక్క ప్రమాణ మొనర్పవలెను.

భీమ—ఎట్టిది ?

జానకి—నామరణానంతరము మరల పెండ్లియాడనని.

భీమ—జానకీ! ఏమి మాటలివి. ఎంతఘోరప్రమాణము.

జానకి—ఈప్రమాణమున ఘోరమేమున్నది. నిక్కువముగ మీరామాట పరిపాలింపవలెనను దృఢనిశ్చయము గలవారైనచో ప్రమాణము చేయుట కేయాటంకము నుండదు. అట్లుగానిచో వెనుదీయ నవసరముండును. అంతయేగాని ప్రమాణ మెల్లు ఘోరమగును.

భీమ—నీమాటలు నాకర్థమగుట లేదు. నీవు చెప్పినట్లే ప్రమాణము చేసెదను.

జానకి—రండు (అని భగవద్గీత అందిచ్చును.)

భీమ—నామాటయందు నమ్మకము లేదా ? పోనిమ్ము. (అని పుచ్చుకొని) ఇదిగో భగవంతుని యానగలదు. మజ్జన్మాంతము మరల వివాహమాడను. అంతియగాదు

కామాసక్తుడనై స్త్రీసాంగత్యము అపేక్షింపను. సరియేనా! మగువలు కేవలము మగవారి విషయేచ్ఛలు దీర్చుటకే జన్మించినవారు గారని ఎఱిగితిని. సరియేనా! (ప్రేమయోగము బలవంతమున నలవడదని తెలిసికొంటిని.) మనదేశమునకు మోక్షసాధనము పతిభక్తికన్న సతిభక్తియే యని గ్రహించితిని సరియేనా?

జానకి—నాథా! క్షమింపుడు. . .నే నాడిన పరుషవాక్యములను నాగ్రహింపకుడు. . .ఆ పల్కులు నావియని తలపకుడు. అవి యీ మహాదేశమునందలి సతీమణుల యార్తనాదములు! అబలను, పరాధీనను, నాకొక్కదానకు అంతధైర్యముండునా? అసంఖ్యాకులైన యబలావతంసముల అవ్యక్తహృదయాక్రందనము అట్లు మూర్తీభవించినది సుమా!. . .ఇక నామనసు చల్లనాయెను. తమకడ సెలవుదీసుకొందును. (తిరిగి) ఇంకొక్క పనియున్నది. . .పంతులుగారూ! ఇంతవరకు ప్రేక్షకుని వలె ఈనాటకము నవలోకించుచుంటిరి. . .ఇప్పుడు తమరును తమ మిత్రులవలె ప్రమాణ మాచరింపవలెనని నాప్రార్థన. తమ యిల్లాలు మరణించిన వెనుక మరల నొక కసుగందని నిసువును పరిణయమాడనని ప్రమాణ మాచరింపుడు. ఏల యనుమానించెదరు?

పంతులు—ఇట్టి భయంకర ప్రమాణము నే నెందుల కొనర్ప వలెను? నే నేమి యాచరించితిని?

జానకి—ఈ ప్రమాణమే అంతభయంకరముగ నున్నదా? మీరాచరించిన కృత్యము భయంకరముగ లేదా?

పంతులు—ఏమి, తెలియక మాట్లాడుచున్నావు. . .మతి భ్రమించినదా? ఉన్మాదమా?

జానకి—(నెట్టిగ) పిచ్చి బ్రాహ్మణుడా! తెలిసియే మాట్లాడుచున్నాను. . .ఉన్మాదమా? అవును. ఉన్మాదమే. అయ్యయ్యో! ఈమగవారి కెంత గుండెనిబ్బరము, హత్యచేసిన వారికి ఎంత స్థైర్యము!

పంతులు—హత్యయా?

జానకి—(కన్నీటితో) హత్యగాదా? నోరెరుగని పసికూనను, చెక్కుల పాలు గారెడి చిన్న బాలికను నీభార్యను-భార్యయనిన జలపరించుచున్నది—నీభార్యను చేతులార నీవు హత్యయొనరించితివి గాదా? ఇంకయు నీయభీష్టము సిద్ధింపలేదని, నీకామాసక్తికి ఉపకరింప లేదని, మందు లిచ్చి చంపించినది మీరు గాదా?

పంతులు—ఆఁ ఆఁ ఏదో పొరబాటు. ఎవరు చెప్పిరి? అసత్యము—వెట్టి—అబద్ధము.

జానకి—అసత్యమా? పొరబాటా? ఓహో! ఎంత కఠినుడవు. (ద్వారము కడకు వెళ్లి) తిమ్మయ్యా!

తిమ్మయ్యా! రమ్ము. మీపంతులుగారికి ఆశుభ వార్త నీవే చెప్పుము.

(ప్రవేశము తిమ్మయ్య తడబడుచు భయకంపితుడై)

తిమ్మ—స్వామీ!

పంతులు—ఏమి తిమ్మయ్యా! ఏమి జరిగినది? ఎందులకట్లు చలిజ్వరము వచ్చినవాని వలె వడకు చున్నావు?

తిమ్మ—అమ్మగారండి! మజ్జిగన్నము తిని కడుపులో నేదో వికారముగా నున్నదని కొంత బాధపడి...

(రోదనము సేయ దొడగును)

పంతులు—అయ్యో! అయ్యో!

[యవనిక]

---

రంగము ౨. భీమరావుగారి గృహమున నొకగది.

[ప్రవేశము జానకి]

జానకి—నానాటకము ముగిసినది, ఇక నిద్రపోవచ్చును. (నిట్టూర్పు విడిచి) జానకీ! నీచరిత్రము ఎంత త్వరితముగ పరిసమాప్తి యైనది. కుసుమము వికసించియు వికసింపక మునుపే నేలపైబడి కాలిత్రొక్కుల కసుగంది పోయినది గదా. ఈయభాగ్యపు జీవితమునకై దైవమా! నన్నేల సృజించితివి? అయ్యో! నిన్నేందుల కడుగుట? నీకు దెలిసినకదా. లేదు. మా ధర్మపరిపాలకులనే అడిగెదను. మా మతాచార్యులనే ప్రశ్నించెదను. మా సంఘోద్ధారకులతో విచారించెదను......నేనేమి తప్పుచేసితిని? తప్పుచేసిన వారుగదా శిక్షింపబడుదురు. అది గదా ధర్మము, న్యాయము. తప్పుచేసినది యొకరును ఆతప్పునకు దండన మనుభవించువారు ఇంకొకరునా?.........

(ఇటునటు తిరుగుచుండును.)

(వీధిలో బిచ్చగాని పాట వినబడును.)

అకటా! ఆబిచ్చగాని యానందము నాకు ప్రాప్తము లేదు గదా......ఎందుకు కాగూడదు? ఇదిగో! ఇప్పుడే వెళ్లిపోయెదను...నారచీరలు ధరించి, పుణ్యా

క్షేత్రములు సందర్శించుచు, నిర్మల నదీతోయముల స్నాన మాచరించుచు, రామనామస్మరణ మొనరించు కొనుచు కాలము గడుపరాదా—గడుపరాదా? (గవాక్షము నుండి తొంగిచూచి) అయ్యో! ఆ బిచ్చగానిని అందఱును తిట్టి పారదోలుచున్నారు... అబ్బబ్బ! నాకును ఆగతియే పట్టును గాబోలు. ఎట్లు భరించుట... లేదు... ఆమార్గము నాకు గాదు... ఇచ్చోటనే యుండిపోయెదనని వారికి వాగ్దానము చేసితినిగదా... అట్లె ఉండిపోయెదను... నాదేహము నిచ్చటనే వదలిపోయెదను... ఈ దేహమున కాసపడి గద నన్ను పరిణయమాడినది. ఆదేహము ఇక్కడనే యుండును... ఇక ఆత్మ?... ఆత్మయున్నదా?... భయమగుచున్నది... పాపాత్ముల యాత్మలు నరకమున బాధ లనుభవించు నట గదా. నేనును పాపాత్మురాలనే గాబోలు. కాదు, కాదు. నే నేపాపము నొనర్పలేదే... మనసార నొకని ప్రేమించుటయు పాప మగునా? ఛీ ఛీ, ఎందులకీ సంశయములు! ఈ మహాప్రశ్నలకు ఉత్తరములు అనతికాలములో బడయ గలదానను గదా. ఇంక కొంతకాలమే గదా ఈ ప్రపంచమున నాజీవయాత్ర... అక్కటా! ఈ సౌందర్యపూరిత లోకమున పాప పుణ్యముల నెవ్వరు తెచ్చిపెట్టిరో గద! పంచమ స్వరంబున నాలపించు కోకిలకు, నవ్వు లొలుకు పువ్వులకు—పాపభీతి లేదు

గదా! అబ్బ! ఇట్టి యానందమయమైన లోకమును విడిచిపోవుటయా? ఎచ్చటికి? ఏ దుర్గమాంధకారనిబిడీకృత ప్రదేశమునకో? ...వలదు, వలదు... అట్లు చేయజాలను...ఏ చెట్టుక్రిందనో, ఏనదీతీరముననో, ఏగుహాలోపలనో తలదాచికొని, ఈ యానందమును గ్రోలుచుండెదను...(మరల నిట్టూర్చి) ఇంకెక్కడి యానందము? భస్మమైపోయిన నాజీవితము చిగురించు టెట్లు?...పరమేశా! కృపానిధీ! నాకు ధైర్యస్థైర్యములు ప్రసాదింపుము...మార్గమొక్కటియే ఉన్నదనుచున్నావా? అవును...నేను జీవించి ఫలమేమి? నా కిక సౌఖ్యము దూరము. నేనుండుటచే నానాథునకు పరిభవము, వేదన, సంశయము—రామచంద్రునకు కలంకము, వాంఛ, చింత, —జనకునకును కుమారునకును స్పర్థలు, ఎడబాటు. ఎందుల కట్టి జీవనము!...నా యొక్క జీవనము లోకమునుండి అదృశ్యమైనచో నిర్వురకు మేలొనర్చినదాన నగుదును......ఏమో! కాలగర్భమున నెట్టి సంఘటనములు గుప్తమై యున్నవో...నాయట్టి దౌర్భాగ్యపు వనిత లింకయు నెందఱు తమ జీవితమును, మానములను, ప్రాణములను ధారవోయవలెనో గదా మాదేశమునకు మోక్షప్రాప్తి గల్గుటకు!... అమ్మా! భరతమాత! ఎన్నికష్టము లెన్నిద్రోహములు, ఎన్ని మానభంగములనైన సహించు నీ

యోర్పు నీ పుత్రికల కిచ్చితివా తల్లీ?... (ఘంటలు కొట్టును) ఆలస్యమగుచున్నది. నిశ్చయించుకొనిన కార్యము ఆచరింపక తామసించిన—ఈ చంచల చిత్త మెట్లగునో...ఈశ్వరా! నాకడసారి మ్రొక్కు—...ధైర్యము నొసగి శాంతిమార్గము చూపుము.

(ప్రార్థించును.)

Song

శ్రీ గురు సద్గురు జయగురు

[యవనిక]

---

రంగము 3.

(కొంతకాలము వెనుక అవనిక తీయబడును. జానకి పడుకపై బడియున్నది.)

[ప్రవేశము భీమరావు]

భీమ—ఆశ్చర్యము. వీధితలుపు తెరువబడియున్నది. అజీము లేదు...జానకిసందడి లేదు...ఆఁ...జానకి నన్ను వీడి పోయినదా?...అట్లుండదు. ఆ సంశయము నాకు లేదు. ఆహా! శంకలేని మనసు ఎంత శాంతముగ నుండును!...(అని పడుక వంకజూచి) ఏమిది? జానకి అంత గాఢముగ నిద్రించుచున్నది...(సమీపించి) ఎందులకు నా గుండె లిట్లు కొట్టుకొనుచున్నవి...ఛీ... లేపెదను. జానకీ! జానకీ! అంత గాఢనిద్రనా... పాపము. అలసినది గాబోలు. (మరియు సమీపించి) ఆఁ ఆఁ. నిద్రయేనా, నిద్రయేనా జానకీ! (చేయిపట్టుకొని తటాలున వదలి) చేతు లెంత చల్లగనున్నవి!.. (హఠాత్తుగ క్రిందపడియున్న లోటాచూచి) ఘోరము!...జానకి...జానకి...ఇంకెక్కడి జానకి...దేహము మాత్రము ఈ దుఃఖభాజనునకు వదలి పుణ్యలోకమునకు పారిపోయినది. (ప్రక్కగూర్చుండి) ఆహా! ఈ వదన సౌభాగ్యము చూచిన నీవు లోకము వీడిపో

యితివని నే నెట్లు నమ్ముదును... మోమున ఎట్టి ప్రశాంతత, ఎట్టి నైర్మల్యము విదితమగుచున్నది... (లేచి) దుర్భరము, దుర్భరము. జానకి ఆత్మహత్య గావించుకొనినదని లోకమంతయు నుడివినను... నాకు నాహృదయమునకు, నాయంతరాత్మకు—అట్లుండదు. నేనే హంతకుడను. ఈ సుందర సుకుమార కాంతా లలామను హత్య యొనర్చినది నేనే... నేనే ఈ ఘోర పాప మాచరించితిని—ఆ సాధ్వి నాజేసిన నేరములకు తన ప్రాణమును బలినొసగి విముక్తినొందినది. నా కలుషములు నన్ను పరిమార్చుటకు బదులు—నా దురితములు నన్ను ధ్వంసముచేయుటకుమారు—ఈ నిర్దోషిని, కోమలాంగిని. యౌవనలావణ్యరాశిని—ఆహుతిగొన్నవి... నాయట్టి హంతకునకు శిక్ష యెద్ది? ఈ పాడులోకమున న్యాయాధికారులు ఇట్టినేరములను శిక్షింపరుగద. ఏమి కర్తవ్యము. ~~ఏమి కర్తవ్యము~~... ఈ నాజీవనము నా కెందులకు... నేర మొనర్చినవాడు దండింపబడవలెననిగదా నేను ఘోషించుచుంటిని. ఆ వాక్యము నాకు మాత్ర మెందులకు వర్తింపదు?.. ధర్మము లోకమునకంతయు నొకటియు, నాకుమాత్రము వేరొకటియు నుండునా? ఉండదు... నేనే హంతకుడను. హత్యకు శిక్ష మరణదండనము. జానకీ! చూచితివా నీ మహిమ! ఎట్టి తుచ్ఛునకు నెట్టిధైర్య స్థైర్యములు అలవడినవో గాంచితివా?... (క్రిందపడి

Satan!

యున్న లోటాగైకొని చూచి), ఆహా! ఇంకయు నిందు విషమున్నది...జానకీ! పూర్వము మన దేశమున సతులు పతులతోపాటు చితినెక్కి అగ్ని కాహుతి యగుచుండిరి. ఆ యాచారము తప్పిపోయినది. నేడు సతితోపాటు పతికూడ పరలోకమునకు పోవుచున్నాడు! అంతకన్న పురుషులు ఘనతరమైనకార్యము చేయజాలరు సుమా! వారు స్త్రీలయెడ గావించు దుశ్చేష్టలకు, వారు లలనామణులనుబెట్టు హింసలకు, వారు అతివలకు గావించు అవమానములకు—ఇంత కన్న పరిహార మేమి సేయగలరు? జానకీ! ఇదిగో వచ్చుచున్నాను.

(తెరలో తలుపు తట్టుచున్న చప్పుడు)

ఎవరది? అజీము గాబోలును.

(తెరలో "నాయనా. నాయనా.")

ఓహో! రామచంద్రుడు...జానకి మరణించినది అజీము చెప్పియుండును.

(మరల చప్పుడు)

ఏమిచేయుట. (ఏమిచేయుట)...ఒక్కమారు వానిని జూచి, సెలవుగైకొని...అబ్బ! కష్టము. కష్టము.

దుస్సహము...(గంభీరముగ) హృదయమా! ఎంత పిరికివైతివి! సిగ్గులేదా. చేసినతప్పు నొప్పుకొని క్షమాపణ వేడుకొనుటకు భగవంతుడు ఇట్టి మంచి యదనొసంగుచుండ నెనువీయుటయా? ఎంత భ్రమ. ఇదిగో! వచ్చుచున్నాను.

(నిష్క్రమించును.)

[మరల ప్రవేశము రామచంద్రునితో]

భీమ—రామచంద్రా! అదిగో జానకి.

రామ—నిజమేనా? నిజమేనా? అమ్మ ఆత్మహత్య గావించుకొన్నదా?

భీమ—నాయనా! ఆత్మహత్యయనియే లోకులందురు. భగవంతుని దృష్టిలో నేనే హత్యచేసితిని.

రామ—అట్లనకుడు, అట్లనకుడు. తప్పు నాదే. ఈ నాదౌర్భాగ్యపు జన్మమునే దూషింపుడు.

భీమ—రామూ! ఇంకయును నీతండ్రి స్వార్థపరాయణమంత్ర నిర్మిత మిథ్యాప్రపంచమున మేడగట్టుకొని యున్నా

డనుకొంటివి గాబోలు. చేసినతప్పు చేతితో మూసి పెట్టుకొని జగములో కపటనాటకమాడి సంతృప్తినొందుచున్నా డనుకొంటివా? లేదు. దోషము నాది, పాపము నాది, అని ఈ నాదేహమున ప్రవహించుచున్న ప్రతి రక్తబిందువునకు తెలియును. గృహస్థాశ్రమధర్మము, తద్రహస్యము, తదానందము పూర్తిగ చవిచూచి, పుత్రరత్నమును బడసి, వానప్రస్థాశ్రమము స్వీకరించి, పారమార్థికచింతాసక్తుడనై యుండుటకు బదులు, కామాంధుడనై, విషయాసక్తుడనై, ఈడు జోడుగాని, వావివరుసగాని, ముక్కుపచ్చలారని ముద్దు బాలికను—నా చెలియలి కూతురును—నా చెలియలు సంతోషింపవలెనని యున్నదానిని—అడ్డుసెప్పువారు ఎవ్వరు లేరుగదా యని నేను వివాహమాడితిని. ఈ సుందర జీవకుసుమమును మట్టిపాలు చేసితిని...నీ యెడ మహాపరాధము గావించితిని... నేను మాత్ర మెట్టిసౌఖ్యము బడసితిని?...అదిగో, జానకి! నాకును, నావంటివారికి, వేలకొలది ఈ దేశమున నున్నవారికి—బుద్ధిచెప్పుటకు—తన ప్రాణమును బలి యిచ్చినది...నాయనా! నీవు కొంతకాల మాలసించియుండిన నేనును జానకితోపాటు లోకమును వీడియుందును.

రామ—ఆఁ. ఏమి?

భీమ—కాని నీపలుకువినినంతనే...నీక్షమాపణ వేడుకొని—
సెలవుగైకొని...

రామ—నాయనా! ఎంతపిచ్చివారు...సమయమునకు నన్ను తోడ్తెచ్చిన ఆభగవంతుని కరుణ ఎఱుగకైతిరే... గతించిన జానకి మరలరాదు...సంఘధర్మయంత్రము లోచిక్కుకొని జీర్ణమైపోయినది. తండ్రీ! తమరు ఉసురుల బాసినంతమాత్రాన చెడిపోయినది బాగగునా? మీరు విద్యాధికులు; వక్తలు; శేముషీవంతులు. మీయట్టివారు ఇట్టి దురాచారములను మన దేశమునుండి పారదోలుటకు కంకణము గట్టుకొనుట గాదా మోక్షోపాయము...భగవంతుని కృపతో, అచలితభక్తితో మన జీవితములు ధారవోసిన కార్యమెట్లు కొనసాగకపోవును?

భీమ—(అశ్రుపూరిత నయనములతో) నాయనా! బంగారు పలుకులు పల్కితివి...నిజముగ నాకు మోక్షమార్గమును చూపితిరి సుమా మీ రిర్వురును...అట్లేయగు గాక!...జన్మాంతమువఱకు నాశక్తి, నాబుద్ధి, నా యుత్సాహము—అంతయు నీమహత్కార్యమునకే విని యోగించెదను...నే నెంతయో అపేక్షింపను...ఇట్టి బాల్యవివాహములు, ఇట్టి ద్వితీయకళ్యాణములు— ఒకటి, రెండు మాన్పితినా నాజన్మ ధన్యమైనట్లను

కొందును...నాయనా! రమ్ము! ఈ పుణ్యప్రదేశమున, అవ్యాజకృపామతిని, సర్వేశ్వరుని, నిశ్చలతత్త్వమును, నిర్మలచిత్తమును, నిత్యసత్యసంపత్తియును ప్రసాదింప ప్రార్థింతము.

(ఇర్వురును జానకి మంచముకడ నిలుచుండి ప్రార్థింతురు.)

[స మా ప్త ము.]





**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 108 B 195 |
| పుస్తకం పేరు | శేషపరిధి |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 109 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | III,IV |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Thasin |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |